శ్రీ

"వేగుంజుక్క" గ్రంథమాల

యొక్క

6వ మరీచి

# విలాసార్జునము.

అను ఆఱంకముల నాటకము.

వెంపటి కృష్ణారావు

బరంపురము:
శ్రీ స్వేచ్ఛావతీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1914.

చందాదారులకు
వెల రు. 0-8-0
అంచెకూలి కాక

*Copy Right Registered.*

ఇతరులకు
వెల రు. 0-12-0
అంచెకూలి కాక

# రాజపోషకులు.

మ. రా. రా. శ్రీ శ్రీపిఠాపురము రాజాగారు.

మ. రా. రా. శ్రీ శ్రీసంగమవలస జమీందారుగారు.

మ. రా. రా. శ్రీ పుక్కెళ్ళ-తమ్మయ్యనాయుడుగారు, బారువ.

మ. రా. రా. శ్రీ దాసిరాజు-నీలాచలం పంతులుగారి ధర్మపత్ని కీర్తిశేషురాలగు శ్రీమతి రంగనాయమ్మగారి జ్ఞాపకార్థము.

మ. రా. రా. శ్రీ దేవరాజు-వేంకటనృసింహారావు పంతులుగారి ధర్మపత్ని కీర్తిశేషురాలగు శ్రీమతి రంగనాయకమ్మగారి జ్ఞాపకార్థము.

# సంపాదకీయభూమిక.

ఆంధ్రమహాజనులారా!

మీయమాన భాషాభిమానంబున మా వేగుఁజుక్క తన యారవ మరీచియగు నీ నాటకంబు నంపఁ జాలి యపరిమితానందంబు నందుచున్నయది.

ఈ నాటకంబునఁ గథావిషయంబు క్రొత్త కాకున్నను, రచనాచమత్కృతియుఁ బ్రకృతివర్ణనలును, హాస్యరసపోషణంబును, లోనుఁగాఁ గల విశేషంబులారయఁ దగియున్నయవి. ఒకవంక లీలార్జునుండును, సుభద్రయు, నులూచియుఁ గలిసి శృంగారరసంబుఁ బోషించుచుండ, నింకొకవంక విశారదుండును జేటియు సత్యభామయు హాస్యరసంబును వెల్లిగొల్పుచుండ నొక్కసారిగఁ జదువరులమనంబులు విచారరహితంబులయి యానందతరంగంబుల నోలలాడుననుటకు సందియంబు లేదు. ఉత్కృష్టంబులగు ననేక లోకస్వభావ విషయంబు లాయాయెడల హాస్యపాత్రల నాల్కలనిడి, కాళిదాస, షేక్స్పియరాది మహానాటక కారుల మార్గంబవలంబించిన గ్రంథకర్తగారి యూహయు దానిసాఫల్యంబును పాఠకుల మనంబుల నాటకుంట దుర్లభము.

అనేకులచే నమితంబుగఁ గొనియాడఁ బడిన మా తృతీయ మరీచియగు 'ప్రేమము' అను నాటిక విషాదాంతమగుట, సరోజినీ ప్రభాకర పక్షపాతులు నత్యంత కరుణాస్వభావులునగుఁ గొందఱు, లోకవిధమట్టిద యనియెఱింగియు, రచనాదివిషయంబుల సంతసించియు, నంతమును భరింపకునికి సూచించి:

రింక వారు నీనాటకంబున సంతోషభరితాంతరంగులగుదు ర
ని, యందఱరంజింపుచు నాంధ్రభాషాసేవ సేయనున్న మా
నమ్మిక.

వంచనలేక వేగుఁజుక్క మేలుగోరి మాయుద్యమంబు
నకు బాసటయొడఁ గూర్చుచున్న యో భాషాభిమానులారా!
మొన్న బ్రహ్మపురాంధ్ర భాషాభివర్ధనీసమాజ శాశ్వతపుస్తకా
గారనిర్మాణమునకుఁగొంతద్రవ్యసహాయమొసర్చి, మాప్రకటన
ననుసరింపఁ జాలినారమని తెల్పఁ గుతూహలులము, యిం
కను మీసహాయము ప్రాపున సహాయావశిష్టములుగ నున్న
యితరసమాజములకుఁ గొలఁది కాలంబులోఁ దోడ్పడఁ జా
లుదుమని యెంతయు విశ్వసించుచున్నారము.

మీ యభిమానంబునకుఁ గృతజ్ఞతా పూర్వక
వందనంబులు.

చెన్నపట్టణము
1—3—14.

తాపీ. ధర్మారావు,

సంపాదకుఁడు.



# ఉపోద్ఘాతము.

చిరకాలపరిచయులారా!

పేరు దెల్పక యీ తెరమఱుగేల యందురా?—క్రొత్త—కాన సంకోచము. మీకు నేను క్రొత్తయనియా?—కాదు-కాదు-ముమ్మాటికి-కాదు, నాటకము నాకు క్రొత్త. ఇది పాశ్చాత్యుల ఫక్కి. మిగులమేలు కాదందురా? చూడుడు. నాటకము బాగుగనున్నదని మీరు మన్నింప బూనినచో, ఆఁ! ఈ మంచి నాటకము వ్రాసినది నేనే యని నా పేరు దెల్పి యామన్ననల నందవచ్చు; అటుగాక ఈ నాటకము మీకానందమొసంగదేని, 'నేను'గా నే తుదవరకు మీకెఱుకపడి నాకునష్టములేక మెలంగవచ్చు. కాని ఒక్కమాట. నా పేరు నెఱుంగగోరి, యూరక నాటకము బాగుగనున్నది' అని మాత్ర మెఱుంగజేయకుడు. 'వాఙ్మాత్రాత్పాతకంపరం' అనుమాట నెఱుంగుదురుగదా!

ఈ నాటకము వ్రాసినప్పుడు నావయసు పదునెనిమిది సంవత్సరములు; కాన (బాలకవియని బిరుదొసంగుదురేమో? వలదు—వలదు—మిమ్ము వేడుకొందును) ఎఱుంగమింజేసిన దోషంబుల మన్నించి ఈ వేగుఁజుక్క గ్రంథమండలి వారిద్వారా నాకెఱుక చేయ మిమ్ము ప్రార్థించుచున్నాను. అభిమానముచే ~~సీనాటకంబును ప్రచురించుచున్న~~ ఈ మండలివారికి నాకృతజ్ఞతను దెల్పుచు నింతటితో నా యుపోద్ఘాతమును ముగింతును.

అయ్యో! ఎంత చిన్నది వ్రాసితిని! ఎంతకొంచెము—ఆ! 'ఉపోద్ఘాతము'నకు బదులుగా 'భూమిక' అను చిన్నమాటను మీద వ్రాసిన సరియగునేమో—ఛీ, ఛీ, వ్రాసితుడుపుపెట్టిన మీయందరిలో నా పేరునకు లోపము రాదా!

ఒక్కమాట—పరోపకారార్థ మిదంశరీరం. విశారదుని పల్కులెటు నేని మీకు వెగటుగఁదోచిన నన్ను మన్నింపుడు.

ఇట్లు.

ఇక్కడ ...రిగిన,

28-2-14. ...ను.



# ప్రచురింపఁబడినగ్రంథములు.

1. ఉషఃకాలము (The Dawn) autobiography of Telugu Literature
   వెల చందాదారులకు 0-12-0 ఇతరులకు 1-8-0
2. వాఁడేవీఁడు ('Tis He) A Detective Tale.
   వెల చందాదారులకు 0-12-0 ఇతరులకు 1-2-0.
3. ప్రేమము (Love) A semi Social & Historical Drama; Tragedy.
   వెల చందాదారులకు 0-6-0 ఇతరులకు 0-12-0
4. సుహృల్లత (Friendship) a Novel.
   వెల చందాదారులకు 0-12-0 ఇతరులకు 1-4-0
5. పద్మినీపరిణయము. పూర్వకవి విరచిత ప్రబంధము.
   వెల చందాదారులకు 0-12-0 ఇతరులకు 1-8-0.
6. విలాసార్జునము. ఆరంకముల నాటకము.
   వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 0-12-0.

## రాబోవు గ్రంథములు.

మనోవినాశము A Novel.

చిత్రనాటకము A Drama.

## అచ్చగుచున్న గ్రంథములు.

1. నేనే. చక్రనిరూపక నవల.
2. సగుణ. చరిత్రాత్మకము నవల.

వేగుఁజుక్క గ్రంథమండలి,

బరంపురం.

**D. V. Kristna Rao.**

*Secretary.*

# విలాసార్జునము.

పాత్రలు

పురుషులు:—

1. అర్జునుఁడు:—కథానాయకుఁడు.
2. విశారదుఁడు:—అర్జునుని మిత్రుఁడు.
3. కృష్ణుఁడు. } అర్జునుని మేనమామకుమారులు.
4. బలరాముఁడు. }
5. పృథుశ్రవసుఁడు:—ఒక సామంతరాజు.
6. మొదటిభటుఁడు. } పృథుశ్రవసుని భటులు.
7. రెండవభటుఁడు. }
8. ముక్రోడు. }
9. జడ్డోడు. } కాపుకుఱ్ఱలు.
10. అప్పిగాడు. }
11. ప్రథముఁడు. }
12. ద్వితీయుఁడు. } కాపులు.
13. తృతీయుఁడు. }

స్త్రీలు

1. సుభద్ర—కథానాయిక.
2. ఉలూచి—ఒక నాగకన్య.
3. రుక్మిణి— } కృష్ణుని భార్యలు.
4. సత్యభామ— }
5. రేవతి—బలరాముని భార్య.
6. చేటి—ఉలూచి చెలికత్తె.

శ్రీ

# విలాసార్జునము.

## ప్రథమాంకము.

### నాంది

⁂

ఉ. శ్రీకృష్ణోత్త మానన కు ♦ శేశయ రాజిత మందహాసని
త్యోదయ సంపద న్మనము ♦ నుబ్బఁగఁ జేసి సతీవితానముల్,
సేవలఁ బ్రోచి భక్తులను ♦ ప్రేమ దలిర్పఁగఁ గాచు నట్టి యా
యాదవవంశపాలకుఁడు ♦ హర్షితము న్శుభ మిచ్చుఁ గావుతన్!

సీ. ముందు వెన్నల సిగలొక్క ♦ ముకురుఁ జూపఁ
జేతఁ జిల్లఁగఁ గ్రోవియు ♦ శీర్ష మందుఁ
బింఛమును, గల్గి యాశ్రితా ♦ భీష్టములనుఁ
జూచి యిచ్చిన దేవుఁడు ♦ శుభమునిచ్చు.

స్థలము:—గంగాతీరము.

ప్రవేశము (అర్జునుఁడు, విశారదుఁడు.)

విశా.—పార్థా! ఇంక నన్నేల యీగుట్టలలోను మెట్టలలోను ద్రిప్పి ప్రాణములఁ దీసెదవు? ఇంటికిరమ్ము పోవుదము. నీ నో ప్రదక్షిణపుణ్యము కాదుగాని నా ప్రాణప్రదక్షిణ పుణ్యము

మాత్రము గల్గును. ఏల యూరక యట్లుఁ జూచుచున్నాఁడవు?

అర్జు.—అంధుల కేమిగాని విశారదా! చూచితివా, యీచోటెంత రమణీయముగ నున్నదో!

విశా.—అఁ! ఆఁ! రమణీయతయా? ఏమేమి? "రమాహేలాశాకశాసనమై, ద్వారకకు ముద్దుచెల్లెలనదగి, యమరావతిం బురడించు" మన యింద్రప్రస్థపురంబు రమణీయము కాదా! ఎక్కడఁ జూచినను మందునకొక సమానన్నది లేక సూనిపోయిన మోపుట్టకైన నెడమీక తుప్పల తంపరయైయున్న యీ పాడుభూమి రమణీయమా? సరిసరి—నేటికిదియు సంభవించినది.

అర్జు.—(నవ్వుచు) విశారదా! అదియేమి యసంభవించినది.

విశా.—మఱి యేమి—రాజ్యవిదూరణమేకాక, మతివిదూరతయును—

అర్జు.—అందుల కేమిగాని విశారదా! చూచితివా యీనదీతీరము!

చ. అలరులఁ బూజఁజేసి మధు ♦ రాసవ ధారల నర్ఘ్యమిచ్చి, మే
ల్పులకు లసచ్ఛ్యమైనిగుడ ♦ వంగి నమస్కృతు లాచరించు న
ట్లులను విశాలభూజముల ♦ నా మృదుగీతలఁ బల్కరించు ప
క్షుల గన నెమ్మి పుట్టెడిని ♦ చూడు, విశారద, యెల్లదిక్కులన్!

ఆస్వాగతమునయిన నందరాదా! ఇంకఁ జూడుము.

గీ. అదిగో, చూడుము, గట్టుపై ♦ నవనిజంబు
లెన్నియో లేచి శాఖలు ♦ మిన్నుముట్టి

త్రిదశలోకంబుఁ జేర్చు నీ శ్రేణి నాఁ
బొల్పుచున్నది దవ్వుల భూసురేంద్ర.

ఇట్టి రమణీయత మన నీటనున్నదా?

విశా.—అర్జునా! నన్నేల యిట్టి యసందర్భప్రలాపంబులఁ గారియ వెట్టెదవు?

అర్జు.—సరి, సరి- నయనాంధుఁడవగు నీకు అప్రకటితప్రాకటంబగు సృష్టివైచిత్ర్యంబు నెఱుకసేయు నాసల్లాపం బసందర్భప్రలాపం బెట్లగును?

విశా.—ఎట్లా! నీవు మీయన్నగారివలన పనివిని యెందులకు పయనమైతివి?

అర్జు.—ఎందులకో నీవెఱుంగవోయి? ఐన నడుగ మిన్నకుంట యేల? గోప్రదక్షిణార్థమై.—

విశా.—అట్లయినం, జెడబలిసి, కదలునంత మాత్రమున నుస్సురను బ్రాహ్మణుల రీతినున్న యీ యెద్దులను, దెబ్బయాకులఁగ నుపారఁదిని సంతర్పణకుఁబోయిన వారలగతి సమితముగఁ బ్రేలు పిట్టలను, బిట్టల కూతలకుఁ జెవిటివాని నవ్వునను ప్రతిధ్వను లిచ్చు గుట్టలను, నీనోరును నా చెవులును విసిగిపోవునట్లు వర్ణించుటయు గోప్రదక్షిణమేనా?

అర్జు.—నీయూహా చాతురి యెంతయు సంతోషదాయకంబగుచున్నది. విప్రకులజుండవైనను బయనమున నేమియో యెఱుంగకుంట యీసంతసంబు నింతింతలుగాఁ జేసి మఱింత వంతకు హేతువగుచున్నది. విశారదా! పయనమున నేమియో నీ వెఱుంగవా?

ప్రదక్షిణ ప్రముఖ కార్యంబుల సలయించి మావంటి మిత్ర వ్రాతంబులఁ బీడించుట చేతఁ గాదుసుమా!

అర్జు.—హా! ఎన్ని పన్నిన నేమి? యేమి చేసిన నేమి? కార్యంబు సఫలంబయినఁగదా నే ధన్యుండ నగుట? (స్వగతము) హా! సుభద్రా! శ్రీకృష్ణా! ఎట్టుల రక్షించెదరో?

విశా.—ఆఁ- సఫలముకాని కార్యమంతయు నీ పేర బ్రాహ్మణుని ప్రాణంబులఁ దీయుటయేనా?

అర్జు.—కృష్ణ! కృష్ణ! కాదు. కాదు.

విశా.—మరి యేమి?

అర్జు.—(స్వగతము) నిజమెఱింగించిన నన్ను పరిహాసము చేయును. కావున నిట్లు త్రిప్పెదను గాక. (ప్రకాశముగా) ఏమియు లేదు విశారదా! యీ గంగాభవానియందు మున్గుటయే నా కోర్కె.

విశా.—చెప్పితిసిరా, మహాప్రభూ! పులిమీఁదఁ బుట్రయును నట్లు ఈ గంగానది పీసకంటు నేలఁబడినదిరా, దైవమా! తొంటినుండియు నెంతపిలిచినను గదలకుంట యుండుల కా? నాభయంబుల సహితము నిజము సేయుట దేవునకుఁ బ్రీతిగాఁబోలు! కానిమ్ము, రానున్నది రాక మానదుగదా!

అర్జు.—విశారదా! ఏమనియెదవు? చూచితివా?

చ. తరగలు చేలగాఁగ, సము ♦ దారతఁ గుల్కెడు పక్షికూజితం
బరయఁగ మేఖలధ్వనిగ, ♦ యానము వాహినిగాఁగ, నొప్పు నీ
వరనదిఁ గాంచి నాడవె! సు ♦ వాసినిగాఁ గనుపట్టు; దాననే
సురవిభుఁ డీశ్వరుండు కడు ♦ సోలుచుఁ బట్టెను దత్కరంబుగన్.

విశా.—ఈ నాఁటకంపు సొంపు పని చేసినదియు ప్రోత్సాహ మేనా?

అర్జు.—విశారదా! ఏమిది మతిలేని గతి నుడువుచున్నాఁడవు. నాఁటకంపవియా యంటివి?

గీ. 1 పల్లకనుపట్టి గంగామ ♦ తల్లి తనయ
2 శిశువునంపినఁ దాల్చుట ♦ చేతఁ గాక!

విశా.—ఆఁ! తప్పక "చేతగాకయే." అట్లొప్పుకొనుము. సమ్మతించెదను.

అర్జు.— 3 విషమ్ముఁ మ్రింగియు ప్రాణంబు ♦ విడకుండ
4 నెట్లు మనఁగలవాఁడు మ ♦ హేశ్వరుండు?

విశా.—ఓహో! అట్లా! అట్లయిన నీగాథయంతయుఁ గల్పితమే గదా!

(అర్జునుఁడేదియో చెప్పఁబోవును.)

ఏదైన మనకేమిగాని ఆదెసనుండి చూడుము. ఒడి విడువఁ గుట్టలు చేయు కలకలంబు పగిదిఁ బరగెడు జలంబుల యలుకుడుఁ బలె వచ్చుచున్నదమేమి? బాహుబలోద్ధత కాష్మక విముక్త బాణారావము కాదు గదా! భయమగుచున్నది.

అర్జు.—వెఱ్ఱివాఁడా! అల్లదె నా చే చాయుం జూడుము!

గీ. గంగలోముస్గువారి యు ♦ ఘంబువోలెఁ
వెల్ల తామరలోనుండి ♦ తేటిసమితి
ఝుమ్మనుచు లేవ నానిన ♦ దమ్ముగాని
వేఱుగా దిది యాలింపు ♦ వీనులలర.

విశా. (తల యూచుచు) ఇదియొక్కటియా? ఇదివరకే నీ మతిమాలిన మాటలతో గ్రుక్కి సోలియున్న నాచెవుల కు నీతుమ్మెద ఝుంకారము గోరుచుట్టుపై రోకటిపోటు కాదేమో యనియూ వినుమని బోధసేయుచున్నాఁడవు! చాలుఁ, జాలు.

అర్జు. (నవ్వును)

విశా. ఎలుకకు ప్రాణసంకటము-పిల్లికి చెరలాటము-అను నట్లున్నది. ఈతిరుగుటంజేసి సగము ప్రాణంబులు పోవఁ దక్కిన సగమైన నింటి కెట్లుకొనిపోదునురా, దైవమా! యని నేనుండ, నీకు నగవులా? ఇందులకా నన్నిటకుఁ దెచ్చినది.-సిరియే-ఊ! కానిమ్ము-

అర్జు. విశారదా! నీపల్కులు విన్న నగవు వచ్చుచున్నది. నీవు మనోహర వాచాలుండవుగదా!

విశా. వాచాలతయైననేమి? యేమైన నేమి? నిన్నటినుండి మార్గంబు పట్టనిచ్చెనా?

అర్జు. అట్లయిన నిదిగో యీపుణ్య స్రవంతిం దానమాడి మార్గంబుపట్టుదము. రమ్ము-స్నానంబున కాయత్తంబుగమ్ము.

విశా. స్నానమొకటియా? (స్వగతము) యింక నేనేమి చేయుదును? మునుగకఁ దీరదు కాఁబోలు.

అర్జు. ఏమట్లనుచున్నాఁడవు? ఈ సురనదీతిలకంబు నీమనంబునకు రాలేదా?

విశా. మంచుఁగొండఁ బుట్టుట నంటినఁ గరచునంత చల్లగ నున్న యీ నీరంబులముంచి అలసిపోవుటకు సిద్ధముగ

నున్న నాప్రాణంబులఁ దీయకుండ నన్నోర్వివిడుచుట నీ మనంబునకు రాలేదా?

అర్జు. విశారదా! యేమట్లనుచున్నాఁడవు? రమ్ము. ఈపుణ్యోదకంబుల నోలలాడి కృతార్థులమగుదము.

విశా. కృ-తా-ర్థు-ల-మ-గు-ద-ము-ఎవరు? నీవా? నేనా.

అర్జు. ఏమి? సురనదీ సలిలంబుల మున్కలు నిన్నుమాత్రము కృతార్థునిఁ జేయవా?

విశా. ఔనౌను. ఇరువురము కృతార్థులమే యగుదుము.

అర్జు. (స్వగతము) ఏదియో విపరీతయూహాకల్గినది. (ప్రకాశముగా) విశారదా! ఏల యిరువుర మని నొక్కిచెప్పుచున్నాఁడవు?

విశా. గంగానదీవిగతాసుండు కృతార్థుఁడనియే యందురుగదా!

అర్జు. అందునకు సందియమేమి? ముక్తికిదగ్గరదారియేయిది.

విశా. ఆరీతిని నేనును, నన్నుద్రిప్పియో-నీటముంచియో-నాప్రాణంబులఁ దీయుటయే నీకోర్కెయగుట నీవును, కృతార్థులమేయగుదుము.

అర్జు. నిలింపనిర్ఘరోదకంబుల మున్కలు శ్రేయస్కరంబులని పెద్దలు నొక్కివక్కాణించుచుండ నీవేల యిట్లనియెదవు?

విశా. సంధ్యామంత్ర పఠన శ్రేయస్కరమేగదా!

అర్జు. కాకేమి, మనమును--

విశా. చచ్చునప్పుడును సంధ్యమంత్రమేనా?

అర్జు. ఇప్పుడు నీకంతగా మూడనున్న దేమి?
విశా. ఏమియులేదు. ప్రాణ మూడనున్నది.
అర్జు. అమంగళము శాంతించుగాక! విశారదా, అంతటిపని కిఁ గారణమేమి?
విశా. కారణమా? అర్జునుని గోప్రదక్షిణమే?
అర్జు. హరిహరీ! నాగోప్రదక్షిణము నిన్నేమిచేసెను?
విశా. ఏమిచేసెనా? కొరగానిత్రిప్పులను ద్రిప్పి ప్రాణములఁ దీయుచున్నది. హా ఈశ్వరా! ఏముహూర్తంబున నిల్లువెడలితినోగదా! సమయంబునకు సరిగఁ బట్టెడుగోగిరమునుఁ గ్రుక్కెడు నీళ్ళును లేవుగదా! దూదికన్న మెత్తనైన నా యడుగులఁ గ్రుచ్చుకొనిన ముండ్లసంఖ్య వేనోళ్ల చిలువకైనను లెక్కింపఁ దరముగాదు. ఇంక హాయిమని కూర్కొననెట్టిదో క్రొత్తాయెగదా! ఇది యిట్లుండ దేహమందలి శ్రమయయన్ననో నావలెగష్టముల నందినమహాత్ములకుఁ దప్ప నితరులకుఁ దెలిసికొన నసాధ్యమగును. హా! దైవమా (చతికిలఁబడును).
అర్జు సీ. జ్వరముచేఁ బీడితుండగు • నరున కేది
చవి కొసంగినఁ జేదను • సరణి సఖుఁడ,
జ్ఞానహీనత నెల్లశ్రేం•గారములను
దూలనాడును గష్టంబు•తో సమముగ.
విశారదా! అట్లయిన నేనుబోయి స్నానమాడివత్తునుగాక?
గీ. శివుని శిరము నెక్కి • చేతోముదము తోడ
నాడుచుండు నాన, • యల్ల భీష్మ

గాంచి వెలయుతల్లి • గంగాభవాని! వే
కరుణఁజూడ నన్నుఁ • గావవమ్మ!

(అనిపోవుచున్నాఁడు).

విశా. (చలి నభినయించుచు) చలి-చలి-అబ్బబ్బ-ఉ, ఉ, ఉ, అయ్యో, అర్జునా! ఇటు రమ్ము (సంభ్రమమున) ఇటు రావయ్యా-చూచెద వేమి? (లాగును-)

అర్జు. ఏమియిది విశారదా! నన్ను లాగుచున్నాఁడవు?

విశా. అర్జునా! నీ వివేకములోభి యొక్క ధనంబువలె కార్యంబునకుఁ గొరగాకున్నదిగదా! ఈపాటి గ్రహింపఁ జాలని నీయూహాచాతురి యెందులకు?

అర్జు. ఇట గ్రహింపవలసిన విషయమేమి?

విశా. (స్వగతము) ధన వివేకములు గలిగినంతమాత్రమున నే పండువా? వానినుపయోగించు బుద్ధిగదా ప్రధానము. (ప్రకాశముగా) అర్జునా! ఈచల్లగాలి నీశరీరమును దాకుచున్నదా? ఉహుహూ-చలిచలి-

అర్జు. తాకుటయేగాదు, డెంద మానంద మొందఁ జేయుచున్నది.

విశా. చాలు; చాలు; నింక గట్టిపెట్టవచ్చు నీప్రలాపంబులు. ఈగాలి యెందులకు వీచుచున్నదో నీవెఱుంగుదువా? తెలివిమాలినవాఁడై అర్జునుఁడు ఇట్టి సమయంబున స్నానంబునకుఁ బోవుచున్నాఁడుగదా యని మీపెదతండ్రియగు పవనుండు దయఁ దలంచి యీశీతలవాయువును బంపెను. ఇఁకనయిన నీస్నానమందలి యూహ మానుకొనెదవా?

అర్జు. జ్ఞానహీనత కున్నతస్థానంబుగాఁ గల్పించుచుఁ బలికెడి నీ యూహ లెంత వినోదములుగ నున్నను న్యాయమే యగును గాని, ఈయూహాలుమాత్రము గట్టిపెట్టుము. ఈగలి-

గీ. నాదు ప్రార్థన విని కరుణాప్రసంగఁ
వచ్చు కహ్లారహల్లీకావాసభింభ
రముల గానలోలస సమీరంబు గాని
వద్దు వద్దన వీచెడి పవన మటవె!

విశా. ఓహో! నీయూహాలు! అట్లయిన నింక నీయిచ్ఛవచ్చి నందులకుఁబొమ్ము.

(అర్జునుఁడు పోవును)

ఈయనకు నేనేమి చెప్పిన వినఁడుగదా; నేనేమిసేయుదును? ఈ పాడుగాలి నాకుఁ జురుక్కున తగిలినదయ్యు నీయర్జునునకు నెంతయో హాయినిఁ గలుగనిచ్చెనట! అందుననే గదా యీతెమ్మెరలు రెండునాల్కలుగల పాముల కాహారముగాఁ జేయఁబడెను. మాదారిలో నీనదిని సృజించిన యాబ్రహ్మపేరిటి జడునకొంప యెంతముంచినను దప్పులేదు. ఈనదియు నొక రమణీయతయంట. చేతగాని మంగలివాని క్షౌరము తెరంగున నొకటఁ నిసుకతిన్నెయు వేఱొకటఁ బల్లకయుఁ గల్గి పసిబాలుఁడు గీయు గీఁతభంగి వక్రతమంబులకు గట్లంగల్గి చోరకవిచెప్పు కవితగతి ఇచట నత్యున్నతమై యొకచోట నతిహీనమై, జడత్వంబునకిక్కయగు చపలత్వంబునకు కాణాచియైన యీనది సంతోషదాయకమఁట! ఈ అర్జునుని పిచ్చి తలంపులు.

(అని అర్జునువకంజూచి)

అహాహా! ఈస్థలమహాత్మ్యము. ఇప్పుడుచూచినది యొక్క గంగానదిగదా. ఇప్పుడు యమున యెచ్చటనుండి వచ్చినది; ఆహా తప్పదు యమునయే ... యమునయేనా? కాకున్న నింకేమి? గంగాప్రవాహమునందు నల్లనీరెక్కడ యుండును? నిస్సందేహముగా యమునయే. ఇదియేసంగమస్థానము. ఇంక నేనీ సంగమస్థానంబునఁ స్నానమాడెదను గాక.

(లోనికిఁ బోయి తడిబట్టలతో చలినభినయించుచు తిరిగి వచ్చి) ఉహూహూ! అబ్బబ్బ! చలిచలి ఆహాహా! ఎంతమోసపోయితిని. ఈయర్జునుని తలవెంట్రుకలు నీటమెలంగుటఁ జేసి నల్లనినీరుగలయమున, గంగనుజేరిన సంగమస్థానమని భ్రాంతిని మున్గితినిగదా! హా! అర్జునా! గుడాకేశా! మెచ్చితిని, మెచ్చితిని. నీకోర్కె సఫలమైనదా? ఆహా-హా-హా? (చలినభినయించుచు) యెంతమోసపోయితిని! ఎంత ఘోరమాయెను! నేరక మునింగితినిగదా! ఉహూ. (వణకుచుండును).

అర్జు (తిరిగివచ్చి) ఏమివిశారదా! ఇంతగావణకుచున్నాఁడవు? యీవస్త్రము నీపై గప్పుదునా?

విశా. చాలుఁజాలు నీమర్యాదలు నాకక్కరలేదు. స్నానము నాకు వలదోయని నేనిచ్చటనుండ నీవుట్టిమునిఁగి నట్లూరకుండక నన్నేదో యొకవిధముగా నీచలినీటముంపఁ బ్రయత్నించి యూహలఁ జేసి నన్నిందులోఁ ద్రోసి యిప్పు

డు వలున గప్పవచ్చుచున్నాఁడవు. ఇందులకా నన్నిచటికిఁ దెచ్చుట?

అర్జు. పోనిమ్ము! ఈగతినైనను నీవీపుణ్యస్రవంతిని మజ్జనమొనర్చితివిగదా

విశా. ఆ! మజ్జనమేగాదు-ప్రాణవిసర్జనయుం జేయసిద్ధముగనున్నాఁడను.

అర్జు. అమంగళము శాంతించుఁగాక-నీ కింత వేగ మది యేల? వలదు-వలదు-

విశా. ఇంకను నన్నెన్ని నదులలో ముంపఁ బ్రయత్నించుచున్నాఁడవో? నా ప్రాణంబుల నింతటితోనైనా పోనీయవా? -కానిమ్ము. తాఁ దెచ్చుకొన్నది తా ననుభవింపకవీలా?

అర్జు. విశారదా, ఇటఁగూర్చుని జపము జేసికొందమా కొంతతడవు?

విశా. ఉఁ-కానిమ్ము.

అర్జు. కాని మ్మనం జాలదు. అది నీ కిష్టమేనా?

విశా. నీవు చేసినవన్నియు నాయిష్టప్రకారమే చేయుచున్నాఁడవా? ఇందులకు మాత్రము నాయిష్టము కావలయునా?

(అర్జునుఁడు విశారదుఁడు జపంబునకు గూర్చుందురు)

(ప్రవేశము ఉలూచి, చేటి.)

ఉలూ. సఖి! చూచితివా? మనలోకంబునకును, ఈలోకంబునకును గల వ్యత్యాసము.

చేటి. చెలీ! ఉలూచీ! ఆవ్యత్యాసముం జూడవలయునా? వి
నినంతమాత్రంబున వెల్లడి యగుంగదా! మనది నాగలో
కము. ఇయ్యది భూలోకము. నేను వెఱ్ఱిననుకొనియా
యీప్రశ్నంబు నడిగితివి?

ఉలూ. తొలుత నే నట్లనుకొన నేరనైతిం గాని నీప్రత్యుత్త
రంబువలన నీ వెఱ్ఱి వెల్లడిచేసికొంటివి. నేనిచటి యందంబు
ననచటి శృంగారంబునుగూర్చి యడుగ నీవిట్లుత్తరమిచ్చుట
పాడియే?

చేటి. ఏమేమి? యీభూలోకంబుననుగూడ నందంబులేనా?
లోకంపువారేయింత శ్రుతికఠోరముగ నుండ నందమొక
టియా? ఏదీ, చూతము ఒక్కయందమైన వస్తువుం
జూపుము.

ఉలూ. సఖి కంటివే యాసూర్యుని—

గీ. తన కర స్పర్శనంబున • వనజము లవె
నవ్వుచును జూచు సొగసులు • నివ్వటిల్ల
సదయుఁడగునట్టి ప్రియకర•స్పర్శచేత
ముదితయైనవ్వు వెన్నెల • సుదతివోలె.

చెలియా యీతట్టుచూడుము.

ఉ. పచ్చని పైరుఁ జూడఁగ న•పార సుఖంబుఁ బొందెడిన్
గొచ్చయి తప్పిన న్మొలయు • నిక్షుర భంగము మోదదంబుగా
మచ్చికఁ బొంతలన్బెరిగి మా•టికి నీరము నీరము ల్కొడుక్
బొచ్చెము లేని కూర్మి పలుము•ద్దుల నిచ్చుట గాంచ భాగ్యమే!

ఇట్టిభాగ్యంబులఁ గాంచు నదృష్టంబు తమోపరివృతావనీజంబులమగు మన కెట్లు లభ్యంబగును?

చేటి. (స్వ) ఓహో! శ్రుతిమించి రాగంబునఁ బడుచున్నది. మా లోకంబు తమోపరివృతంబఁట. మేమదృష్టహీనులమఁట. ఇఁక నేమివింతలో చూతము (ప్రకాశముగా) ఉలూచీ! అయినదా నీవర్ణించుట!

ఉలూ. సఖి! ఏలనే యిట్టి వెడగుమాటలచే మనంబునకెంతయు వంతగూర్చెదవు? మార్తాండ ప్రభాకిరణజాల విరాజమాన సర్వంసహాచక్రంబగు నీమర్త్యావనియెడ, తదేకావలోకన సంజనితతమోభ్రమణ మొనర్చునే నేడ?

ఉ. ఇక్కడి సూర్యకాంతులును • నిక్కడిశోభఁదలిర్చు వృక్షముల్
ఇక్కడి పుష్పజాతులును • నిక్కడి చక్కని శాద్వలంబులున్
ఇక్కడి జంతుజాలములు • నెమ్మెయిఁ దెల్పఁగ నేర్తుఁ? దీని క
మ్మక్కరొ! నాను హస్తిమశ • కాంతరమా గదఁ జూడఁగాఁ జెలీ!

చేటి. ఇంక మనము నాగలోకమునకుఁ బోదమా? (స్వగతము) చూడఁజూడ నయ్యవారు కోఁతియగునట్లున్నది.

ఉలూ. చెలీ! ఈయందము నెవ్వడైనంగంటివే?

చేటి. నీకుమతిపోయిన నాకుమతిపోయినదనుకొంటివా?

ఉలూ. ఆఁ! అదియేమి? మతిపోవుటయా? నాకేటికి మతిపోయినదనుచుంటివి?

చేటి. మతిపోకున్న నీవింతలేమి? అవినుమానికంబునట్లు వర్ణించుచుఁ గాలయాపన జేయుచున్నదానవు.

ఉలూ. ఇది కాలయాపనగా?

చేటి. కాకేమి? ఈ తీవ్రకరుఁ డొక స్తుతిపాత్రుండఁట!

ఉలూ. ఏ మేమి?

గీ. ప్రాణములకును తావు • బలమునకును బ్రోవు,
తేజమునకు నిక్క • తెలుపునకక్క,
పంట సతికిఁదోడు • పగటికి నెకిమీఁడు,
వంద్యుఁడగున కాఁడ • పడతి మాఁడ?

చేటి. మన లోకంబునఁ బ్రతిజీవిశిరంబున నిగనిగ మెఱయుచుండు ముద్దుల మాణిక్యముండ, నావినుమానికము వ్యర్థముగాదే? నిరు పేదలగు మానవులకుం దగినదిగాని మనకు లోపంబగునుగదా సూర్యుఁడుంట, చలి దూరపుఁ గొండలు నునుపే

ఉలూ. అజ్ఞాన మజ్ఞానము!

గీ. తనకుఁ బ్రాప్తించదే యాతి • ఘనమటంచు
నెంచి యితరుల భాగ్యంబు • లెంచరేమొ?
జనుల కక్కటా! తమ యాతి • సమ్మతంబు
కాకి కిష్టంబు గాదటే • కాకిపిల్ల!

చేటి. ఓ హో! ఈ శ్రీరంగనీతుల కేమి సఖి! నీ యూహాలు మాత్రము సరియైనవా? నీకున్న దానితోఁ దృప్తినందక, అసంతృప్తహృదయవై నీకుఁ గలుగని తృణంబునైనను ఘనంబుగ నెంచుట సరిగాఁబోలును.

ఉలూ. నాల్క వేయి విధంబులఁ ద్రిప్పనోపు.
కాదు కాదు, సఖి! నీకీ భూలోకంబంతయు నెంతయు మోదకరం బగుటకు హేతువేమియో నెఱుంగను. అం.

దలి గొప్పతనం బేమేమియో నాకెరుక సేయరాదా.

ఉలూ. ఆ చర్చ లిపుడేల? చెలీ! నేఁడీ కుసుమంబులు మన కార్యంబునకుం జాలవా?

చేటి. సఖి! ఉలూచీ! మన ప్రస్తుతకార్యంబునకేగాక నేఁడే నీ వివాహమహోత్సవమైన నందులకుఁగూడఁ జాలును.

ఉలూ. (స్వగతము) హా! దుర్భరము! (ప్రకాశముగా) అది గో వివాహమని యనుచున్నదానవు.

మ. అతివా, యేటికినిట్టులేచెదు? వి♦వాహంబు బండుఁ బల్మారు న
స్నతి నిర్భాగ్యశిఖామణిన్ విపరితన్ ♦ హాస్యగ్రహతాన్వారిలో
నతిపాత్రన్ జెలి, నీసఖిన్ దలఁచవే? ♦ యన్యాయమాడెంచవే?
మతిలేదే? యభిమానమున్ననవటే ♦ మన్నింతురేయెవ్వరున్?

చెలీ! నా యదృష్ట మిట్లుండ నాకు వివాహ మెట్లగును?

చేటి. వివాహ మొక ఘనమా? నీవునిన్నిట్లు చేసుకొనుచున్న దానవుగాని వివాహముగా కేమి?

ఉలూ. నేఁ జేయునది యేమి? నా నిర్భాగ్యత గాని—

చేటి. నీవు చేయునది యేదియా? జనకు లేరివ్వో రాకొమరుల పటంబులఁ దెప్పించి చూపినను వారినెల్లఁ ద్రుణీకరించి, నీమనసు దొంగిలించిన యాయర్జును, నా గగనకుసుమము నే కోరుచుండు నీకుఁ బెండ్లి యగు టెట్లు?

ఉలూ. గీ. అకట! నాయదృష్ట ♦ మాకాశకుసుమమే?
నన్నుఁబట్టరాడె ♦ నాదువిభుఁడు?
యింక నాకుఁ గల్గు ♦ నీసోయగంబెల్ల!
వెలఁదియడవిఁగాయు ♦ వెన్నెలవలె.

(స్వగతము) హా! నిర్భాగ్యురాలనగు నాకా మహాభాగ్యు ని పొందెడు కల్గును? (ప్రకాశము) పోనిమ్ము చెలి, యింక నాయొద్దఁ బెండ్లియనుమాట నీనోట నుడువకుము—

చేటి. ఏమమ్మా! నుడివినఁ గోపము కాఁబోలును.

ఉలూ. ఔను. కోపమేయగును.

చేటి. (స్వగతము) ఇట్టివారలే పిదప క్షణమయినను మగలను విడువలేకుందువారలు.

(ప్రకాశము) పోనీ, సఖీ! నీ కా యర్జునునిపై నేటికింత మరులు గల్గినది? ఎప్పుడయిన నాతనిం జూచి యెరుంగవుగదా!

ఉలూ. చూచుట యెన్నఁడును లేదుగాని వినుటమాత్రము పెక్కుసారులు గలదు.

చేటి. ఎంత బాగుగనున్నది? వినుటచేతనే యింతయనురాగమా? సరి, సరి, పోనిమ్ము. ఏమనివింటివి?

ఉలూ. ఏమనియడుగవలయునా?

చ. ద్రుపదుని మత్స్యయంత్రమును • దోడినృపాలురు చూచుచుండగా
గపటపువేషమూని నిజ • కార్ముక మెక్కిడి నీటఁజూచి యా
తపనునివీధి మత్స్యమును • ధాత్రిఁబడంగను నేసె, దన్విరో,
చపలమ్ము గాయతాత్ము లటు • చంచలచిత్తులు గాఁగఁ జూడరే.

చేటి. సరి సరి! ఆకార్యంబు నీకొరకుఁ గాదుగదా! ద్రౌపది కొరకు ఆఁ! తరువాత! తరువాత!

ఉలూ. ఇంక నేమున్నది. సమస్తరాజన్యులం గెలిచి ద్రౌపదిం జేపట్టిన యానరుని నేను నాఁడె వరించితిని—

చేటి. వెఱ్ఱికుదిరినది. చెలీ! యందైన నిట్టివింతలున్నవే? వి

న్న మాత్రమున వలతురే-వలతురు-వలచిననింత మోహాం
ధ మే. అబ్బనిబాలుఁ డందాల సేలు ననుగల్గు సులభుఁడు కా
నియా యజ్జుఁ డెంత మేటియయిన నగును. ఇంకనయినను
వానిపై నాస విడిచిపెట్టుకొనరాదా?

ఉలూ. ఏమేమి! ఆసవిడిచిపెట్టికొనవలయునా? సరియా? చె
లీ! నామనోహరుఁడిందు రాఁడా? అక్కటా, విధీ!

చేటి. వచ్చునంతవరకు వేచిన వచ్చును.

ఉలూ. ఎప్పటికైన వచ్చునుగదా నా మనోహరుఁడు? చె
లికా! యెంత సంతోషకరమగు మాట నాడితి. చెలి
ఇప్పు డెచ్చటనున్నాఁడో చెప్పుము, నా మోహనాంగుఁ
డు—చెప్పవే—

చేటి. ఏల యింత తత్తరము. తాలిమివహింపుము. మత్స్య
యంత్రంబుఁ గొట్టుట లోకప్రసిద్ధమేగదా!

ఉలూ. లోకప్రసిద్ధియా? యీరేడులోకంబులలో నాచం
ద్రతారార్కముగా మరువఁజూడనిదిగదా యూధీరుని కా
ర్యము-

చేటి. అట్లగుటం జేసి వానినిం బెండ్లియాడవలె నను వాంఛ
గల నీయట్టివార లనేకులుందురుగదా!

ఉలూ. అయ్యో! ఉండ కేమి? ఆధీరరత్నముం గోరని యువ
తి యుండునా? స్త్రీజన్మమెత్తినందుల కాతనితోఁ గూడిన
గదా! జన్మము సార్థకంబగుట-అది చేకూరని జన్మ మేటికి?
యౌవన మెందులకు?-

చేటి. చాలు నాగుము. సఖీ! నీవు వినువారలున్న యుగం

బులకోలఁది మాటలాడుచుందువు గాఁబోలును—అనురాగుల కున్న లక్షణము నీయందును బ్రకటితమగుచున్నది. అది యటులుండనిమ్ము! వివాహముకొఱకు వారినందఱిని బెండ్లి చేసికొనవలయునా! తొలుతఁ దనలోకము తరువాతఁగాదా నీలోకము.

ఉలూ. ఎవ్వరైన వచ్చిరఁగదా నాయదృష్టము. ఆహా! ఏమి కార్యమొనర్చితివి?

చేటి. ఆ కార్యమునకే యిప్పుడు తగిన శిక్ష ననుభవింపనున్నవాఁడు.

ఉలూ. ఓసీ! మూర్ఖమతీ! తెలివిగల్గి మాటలాడుము.

మత్తకోకిల.

జ్ఞానమింతయులేక ప్రేలెదు ♦ కాంతు శిక్షితుఁ జేయ నే
మానవుం డిలఁజాలు? లోకము ♦ మాత్రగోసజయించు నా
ధీనిధిం గులభూధరోజ్జ్వల ♦ ధీరునిన్ సువిచారునిన్
గానఁజాలకమాటలాడెదు. ♦ కాంతరో, మతిపోయెనే?

చేటి. (స్వ) ఔను! మతిపోకున్న నీగతివిపరీతబుద్ధు లేలఁగల్గును? (ప్రకాశము) శిక్షించువారలా? వేఱుకారు, ఆయర్జునియం దత్యంతానురాగంబు నటించు నీబోంట్లె నిశ్చయముగా శిక్ష చేయుచున్నారు.

ఉలూ. అపరాధము—అదెట్లు?

చేటి. ఎట్లులా? నేరకపోయి మత్స్యయంత్రంబు నేసినందులకుఁ దాననుకొన్న ట్లొక్క భార్యగాక లక్షభార్యల పోరాటము, నుసురును, భరించుట శిక్షకదా!

ఉలూ. లక్ష భార్యలున్న నందరు గాని పోరాటమేల యుండును?

చేటి. రాధా సత్యభామల పోరాటములు మనము వినని వియా? అందులకుఁ గృష్ణుఁడు చేయు చోరత్వంబు క్రొత్తయా? ఆయన యర్జునుని మిత్రుఁడేకదా?

ఉలూ. మిత్రుండా? వారిద్దఱు నొక్కప్రాణమేయట-

చేటి. ఆఁ నిశ్చయముగ నొక్కప్రాణమే సందేహము లేదు- కాని చెలీ! యింటఁ గొన్ని కార్యంబులున్నవి రమ్ము, పోదము.

ఉలూ. పోదము-తొందర యెందుకే? ఈ గంగా సైకతము లెంత యందముగ నున్నవి? (అర్జును జూచును)

చేటి. నేఁడందము లతివృష్టి-

(ఉలూచి చేటి నోరుమూయును.
చేటి చేతితో సంజ్ఞచేయును.)

ఉలూ. ఆశ్చర్యము. ఇటు రమ్ము (దూరముగఁ దీసికొనిపోయి) చూచితివా? ఆ మనోహరాంగుఁడెవరో? చక్కఁగ పరము వైచుకొని కుడిచేతినొక జానువునఁ నిల్పి జపమాల జపుచున్నవాఁడు. ఈప్రక్క నితండొకఁ డట్లనే చేయుచున్నాఁడు.

చేటి. తెలిసిన వీనిఁగూడ వలతువేమో?

ఉలూ. ఇంక నీ ప్రల్లదంబులఁ గట్టిపెట్టుము. తెలిసినఁ జెప్పుము. లేకున్న మిన్నకుండుము.

చేటి. వినినంతమాత్రమున నర్జునుని వలనవచ్చును గాని చూచి యీ సుందరాకారుని వలనఁ గూడదా?

ఉలూ. అందులకేమి గాని యీసుందరాకారునిఁ జూచితివే?

ఉ. చక్కనివాఁడు ప్రౌఢుఁ, డమరుం జంద్రుని గెల్వఁగఁ జాలు వాఁ డితం
డెక్కడి రాకొ లేక జని యించినవాఁ డొకొ? యీమహామహుం
డిక్కడి కేల వచ్చెనొకొ? యెందుల కేఁగుచు నున్న వాఁ డొకో?
యిక్కువరింపఁ గాంతి యగు యింద్రుని నందనుఁ డుండునో మే?

(స్వగతము) ఇంద్రుని నందనుండన్న అర్జునుండు జ్ఞప్తికి వచ్చుచున్నాఁడు. అఁ! (యాలోచించును.)

చేటి. (స్వ) ఆలోచనంబులు జూడ నాలోచనంబులు మెండగున ట్లు కానవచ్చుచున్నవి. (ప్రకాశము) సఖీ! యులూచీ! యేలనో! అంతగా మనంబిచ్చి చూచుచున్నదానవు.

ఉలూ. సఖీ: ఈ సుందరాంగుఁడు మన్మథుఁడు కాఁడా?

చేటి. ఆ, కా,———(ఉలూచివచ్చి నోరుమూయును.)

ఉలూ. ఆక్కవలదు.

చేటి. ఆఁ కాదు కాదు మన్మథునకు రూపమేది?

ఉలూ. ఔనుక దా! మఱచితిని–ఆవియోగ విశ్వాస కళంకితుం డగు మన్మథునకు రూపమెక్కడిది? ఐనను సర్వకాలంబుల సర్వావస్థలయందును దనకరకుటమ్ముల మర్మములూడ నేయు నీ మన్మథుండు నాబోంట్లకు రూపంబుతోనే కన్నులఁ గట్టినట్లులుండును. (ప్రకాశముగా) సఖీ! యీతఁ డెవఁడయి యుండును?

సీ. చంద్రుఁ డన్నను మేనిలోఁ • గందు లేదు.
మారుఁ డన్నను వీని కా • కార మేమి?
మదనుబూదిని సుధశోడ • మెదపి చేసె
నజుఁడు, కానున్న నీమేని • యంద మున్నె?

చెలియా! ఆ ముక్కెంత సొబగుగ నున్నదో చూచి తివే? ఆ కన్నులన్న మూసి కొని యుండఁగ నింత యందము గ నున్నవి గదా తెరచిన నింక నెంత మనోహరంబుగ నుండునో!

చేటి. ఆఁ! బాగుగనంటివి-అదియు నాలోచనార్హమైన దే- కనులు తెఱచిన మెల్ల వాఁడగునో, యేకాక్షుఁడగునో, లేక పరిపూర్ణాంధుఁడే యగునో తెలియదు.

ఉలూ. ఛీ ఛీ-జ్ఞానహీనురాలా! వదరకుము.

చేటి. జ్ఞానహీనురాలనా? పరిపూర్ణచంద్రబింబముం బోలి యున్నదన్న జ్ఞానినగుదును గాఁబోలును! లేక నీవలెనే మైమఱచి మనోహరాక్షుఁడని యెంచి మరులుజెందిన మ ఱింత బుద్ధిశాలి నగుదును గాఁబోలును-చాలుఁ జాలు! నీ యూహలు-నాకు వేళయగుచున్నది. నేను బోవలెను. నీ వీ శృంగారములఁ జూచిన, వెంట నంటిరమ్ము. నేఁబో యెదను.

ఉలూ. అందులకుఁగాదు చెలియా? ఆయవయవముల పొం దుజూచియయిన నూహింపజాలకున్నందులకు.

చేటి. సుందరనయనుండనియా? చెలీ! నీకు మతిపోయినదా? నీవు వలచినంతమాత్రమున మనోహరాక్షుఁడని చెప్ప నె

ట్లగును-నీకున్న వలపా యనరూపంబును మార్పలేదు గదా?-

ఉలూ. (స్వగతము) అర్జునుఁడేయగును (ప్రకాశముగా) ఓ సీ! మూఢమతీ! నాకింత హృదయంగమంబగు నీయాకారము నయనవిహీనమెట్లగును?

చేటి. నీ వెంత క్షేమించినను సరే! నిగనిగలాడి, పేద్ద రేకులం గల్గి చూపరుల కానందంబు గూర్చు మంకెనపూవునకు వాసన లేదను వారందఱును మూఢమతులే గదా! చెలీ! నాకు గాలయాపన మగుచున్నది. పోయెదను.

ఉలూ. అట్లయిన నేనింక గొంతతడవు నయనానందంబునం ది యిదె నీవెంటవత్తును-

చేటి. (స్వగతము) చెలి చిత్తము వేఱుగనున్నది-(ప్రకాశముగా) అట్లనే ముందు పోయెదను.

ఉలూ.(స్వగతము) ఇట్లు కాలిసంకిలి వాయునుగదా, (ప్రకాశముగా) చెలీ! అట్లనే చేయుము-(చేటి పోవుచుండును.) చెలీ! చెలీ! మాట మాట! జనకు లడిగిన నిప్పుడే వత్తుననుము.

చేటి. అట్లనే సేయుదునులే (పోవుచుండును)

ఉలూ. చేటీ! చేటీ! ఇంకొకమాట! నీపని తీరినవెనుక మన యుద్యానవనంబున కాలవాల మొకటి నిర్మించి యందునకు బొందగు పందిలినొండు కల్పింపుము.

చేటి. అట్లనే చేసెద (పోవును)

ఉలూ. మాట మాట చెలియా! నే నిప్పుడేవత్తును ను

మా! వేఱు తలంపకుము.

చేటి. నీ చెప్పు పనులెల్ల నయినవా?

ఉలూ. ఆఁ! అయినవి—

చేటి. పోవుదునా?

ఉలూ. ఊఁ (స్వగతము) నీదే యాలస్యము

చేటి. మఱి పిలువవుగదా?

ఉలూ. పిలువను.

చేటి. వేగముగ రావలయునుసుమా!

ఉలూ. అట్లనే వచ్చెదను.

చేటి. మరచిపోదువేమో—

ఉలూ. మరవనుపో! (అని తట్టును) సఖి! నీవు నవ్వులనక్ష త్రమునఁ బుట్టితివి సుమా.

చేటి. కాదు కాదు, నేను పుట్టినపుడు మాయమ్మ నవ్వుట లేదు. ఏడ్చెను—తరువాత నక్షత్రములు వ్రాలెను. ఇవి యెట్లు నవ్వుల నక్షత్రములగును. నేనింకఁ బోవలయును— (పోవును)

ఉలూ. నేను వినిన దానినిఁ బట్టిచూండ ఈ సుందరాకారుఁ డర్జునుఁడే యగునేమో! అట్లయిన ఈతండే విశారదుఁడు కావలయును. ఈ వసుమతీతల మోహనాకారు నెంత చూచినను తనివితీరకున్నదికదా! హా! కాల మెంత వడి వడి నడుచుచున్నది. యింక నేను పోవలయును. నేను బో వలయునా? కాదు. కాదు. మేము బోవలయును. అర్జును ని నామనోరథంబును గూడ నాతోఁ దీసికొనిపోయెద. అ

ట్లు తీసికొనిపోయిన నా మనోహరుండు వేఱుగఁ దలంచు నేమో-తీసికొనిపోవక నే నేమిసేయుదును. కోపగించిన వేడుకొనియెదగాక హా! హృదయమా! ఎంతసాహసకృత్యంబుఁ జేయుచున్నదానవు?

గీ. సర్వభూలోకమేలు ధీ॰ శాలి నితని
మోహనపు విద్యచే బోస ॰ పుచ్చి నేను
లోకమే కాని వేఱొక ॰ లోకమునకుఁ
దీసికొని పోవుచున్నాను ॰ ధీరనగుచు.

హా! దైవమా! నేనుజేయు నీకార్యంబు తప్పుగ నెంచకుము. ఓ యర్జునా! అనురాగాతిశయంబున నేఁజేయు నీపనికిఁ గోపగించకుము. ఓ! దిక్పాలులారా! అబలనగుట నాయందు కరుణింపుడు. పంచభూతములారా! నా కీ కార్యంబునఁ దోడ్పడుఁడు (చుట్టుతిరిగి-అర్జునుని పైకిఁ దీసికొని పోవును.)

విశా. (కొంతసేపటికిఁ గనులు విచ్చి) నాజపము నాకెంత యుపకారియయ్యెను. జపముమాట జగదీశ్వరుఁ డెఱుంగుఁ గాని తెగఁదిరిగిన బాధలెల్లఁ దీరునట్లు నిద్రఁ దీసితిని. హా! నిద్రా! నీవలని సుఖమెఱుంగని జోగియెవండు. ఇంకనయిన జపంబు జాలింపఁడుగాబోలు నీయర్జునుండు. (తిరిగి చూచి) అయ్యో! అయో! అర్జునుఁడేడీ? పార్థుఁడేడీ? జపము ముగించి లేచిపోయెనా యేమి? పోయిన నన్నేల పిలువఁడు? ఎంత పిలిచినను లేవకుంటినేమో—కోపగించి నన్నిచట డించి తన దారిని దాను బోయెనా యేమి? ఈ పాడునిద్ర నన్నేల యావరించెను. హా! నిద్రా! నీసౌఖ్య

మిన్నుడెక్కఁగితిని. అయ్యో! అయ్యో! అర్జునా! పార్థా! కిరీటీ! శ్వేతవాహనా! ఎంత బిల్చిన రాఁడేమి సేయుదును దైవమా! ఎచ్చటనైన దాఁగి యున్నవాఁడవా యేమి? బీభత్సా! విజయా! జిష్ణూ! సవ్యసాచీ! ధనంజయా! రావయ్యా! నన్నేల యీపాట్లు పెట్టెదవు? అక్కటా! రాఁడుగదా! యేమాయెనో గదా! నే నీ యరణ్యరోదనము చేయుటెందులకు? పోయి వెదకెదను. కానరాకున్న నను వెదకుచుఁ దారాఁడా (నిష్క్రమించును.)

## విష్కంభము.

(ప్రవేశము కొందఱు పశులకాపరులు,)
(గుఱ్ఱిగాడు, జడ్డోడు, అప్పిగాడు.)

గుఱ్ఱి. ఓరప్పిగో! మరంతే నిన్న జడ్డోడు ఆసిగోడి కూతుఁరికి అల్లర పెట్టాడ నంతే పూరోలంతా మనమీఁద కోపాల్లోయి.

జడ్డో. అనాగంతే నాకు మఱింత సిర్రెత్తుకొత్తాదిరా-పూరోలు మనకేంసేస్తారోస్? ఏ మ్మన కాల సొమ్మెట్టారా! ఆల్ల సోకమెట్టారా! ఆల్లెంతో మనమంతే.

అప్పి. అంద నేనేటి? యియ్యాళ యెనకల లెగిసి మాబుచ్చిగోడు బక్కలు పాలానికి తోల్కెల్తావుంటున్నాడు. అదేటనుకున్నా(నా.

జడ్డో. ఏవఁనుకుంటే నాకేట్రా! ఇయ్యేల్లానియ్యన్-యేటి

సేస్తానో సూద్దువుగాని-రాజు కూతురొస్సినా అంతే-యే
టనుకున్నావు నాదెబ్బ

అప్పి. అంతకన్న నాదెబ్బ-

గుర్రు. మరంతకన్న నా రెండు దెబ్బలు.

అప్పి. ఓరే! అనాకాడురా!

దెబ్బరోర్నా దెబ్బ—దెబ్బరోర్నా దెబ్బ (పాడును)
ఆహా! మొదవ్విబక్కలు-అవిటవిటికినాగ పారొత్తాయి
ఆహా (అనిపోవును).

చేటి. (ప్రవేశించి) అక్కటా! యిదిదారికాదు కాఁబోలు (ఇ
టునటుచూచును)

గుర్ర. ఒరేయి! అదేటిరోయి అనాగున్నాది. ఆసిరోడికూతురి
కన్న చిలకనాగున్నాది. చూర్రోయి! ఓరప్పిగో-ఎందిగో
రావు. ఇక్కడమర్తగున్నాది రారోయి.

జగ్గో. ఓరమర్రెంగాడురో! అమర్తంనాకెఱుకిలేదేటి. అది
మనసక్కద్దునాగుంటాదిగాని మూడుకొమ్ముల్రో! ఆకొమ్ముల
న్నా దానాగుంటాయనుకున్నావేటి. నేడికొమ్ముల్నాగ గిర
గిర తిరుగుతాయిరా!

చేటి. (సక్కఁజూచి) ఆఁ! అక్కడనెవ్వరో గోపబాలురున్న
ట్లున్నది. వారినడిగిన, వసంతోద్యానవనంబు తెలిసికొనవ
చ్చును. పోయియడిగెదనుగాక—

అప్పి. ఆఁ! (తిరిగివచ్చి) ఓరబ్బోస్! ఇంతరోయి! అదేటిరా?

జగ్గో ఓరిదిదిరా? అదేటిది? ఇదికన్నెరా!

గుర్రు ఓగూరుకోస! మరిమాకెరికినేదురా! సెక్కొక్కడికే తె

ల్సురా? ఏమొరగన్నాగ సెప్తావేటోస్-కన్నైతే పలుబులే మురా. అదిసక్కనమాకునాగుంటాదిరా.

అప్పి. బాగన్నావు! కన్నెనానెరగనేటి? మాకర్రెద్దుమెడకక్కంటికాదట్రా కన్నె?

జడ్డో. ఓసి కన్నెకాదురా! కన్ని, కన్ని,

గుర్రి. కన్నో గిన్నో! మనకెందుకోన్సి! చంద్రబింబంనాగదగ్గరకొత్తున్నాది. సూడరోయి, రారా! యిక్కడకూకుపోస్. కూకుడురా!

చేటి. (చేరి) ఒరీ!

అప్పి. ఆఁ

గుర్రి. నిన్నుపిల్నేదు ననుపిల్సిందన్సి.

జడ్డి. ఓరీ! నీకుమాట్లామే రాదుండరా నేనెల్తాను—(చేటింజూచి) ఓయి. వెందుకేటి—

గుర్రి. ఓరెంతబాగామాటాడ్రా! అచ్చబామ్మడ్నాగే!

చేటి. ఓరీ! అనంతుని గున్నతోటకేదిరాదారి?

జడ్డో. వసంతునిదోట్లోకా? ఉండుండె! కూకుడుండె! నాస్రేహితుల్దగ్గిరికెల్లొత్తాను (తిరిగి) ఓరప్పిగో!

(పాడును) దారీతెలియాదంట—దారీతెలియాదంట!

అప్పి.
గుర్రు. (అట్లనే పాడుదురు)

జడ్డో. దారీతెలియాకుంటే—దక్కిందిమాకంట!

(అనిపాడుచు చుట్టుజేరి తిరుగుచుందురు)

చేటి. వీరలకేమిచేటు కాలముమూడినదో? ఊరకరట్టు చే

యియున్నవారలుగదా! పోవమన్నఁ బోనీకున్నారు. ఏమిసే యుదును. (ప్రకాశముగా) ఓరీ! మూఢులారా! మీకుఁ బోగాలవా?

గు(రు.
మొ. (పాడుదురు)

మూఢులము మేగాము — మూఢులము మేగాము।
మూఢులనిమమ్మనక — ముచ్చటాడీపోవే।

చేటి. ఓరీ పాపిబాలురారా! ఊరకనన్నేల నాపెదరు? దారి తెల్పినఁ దెల్పుఁడు. లేకున్న నన్నుబోనింఁడు.

గు(రు. నిన్నుపోనిత్తామ — నిన్నుపోనిత్తామ।
నిన్నుపోనిత్తాము — నిక్కముగనమ్ముము।

చేటి. (స్వగతము) ఇట్టి పాడుబాలురుగల యీభూలోకంబు సొగసులకిక్కయంట? దీననాయులూచి మాటలు తేటలా యెగదా! అక్కటా! యీఊచియింతఁ దనకార్యము కు గించునేమో (ప్రకాశముగా) ఓరీ! గోపాలురారా! మీకే మికావలయును? ధనముకావలసినఁ జెల్పుఁడు

గు(రు. మొ. ధనముమాకెందుకో — ధనముమాకెందుకోయ్.
ధనముమాకెందుకో — దగ్గిరనుసీవుండ.

చేటి. వీరు నన్నిఁటనుండి పోనియరుగాఁబోలు దైవమా! ఇ దియేమిమాయ? త్రోవఁబోవువారుసహితము కానరా రుగదా నన్నెవరు వీరిబారినుండి తొలఁగింతురు? ఓరీ! నీచు లారా! ఏలనురా యెంతచెప్పినను నన్నువిడువరేమిరా? మీకండకావర మణగించెదనుసుమా! లెండు, పొండు.

గు|రు. మొ. లెగిసిపోమూ మేము—లెగిసిపోమూ మేము.
లెగిసిపోమూ మేము—లెంకలాగుంటాము.

చేటి. అక్కటా! యేమిసేయుదును. (ప్రకాశముగా) ఓపు ణ్యులారా! ఆర్తజనశరణ్యులారా! రండు! నిర్భాగ్యురాల గు నొక్క యబలనీతులువలు పలునితంబులఁ గారియ పెట్టుచున్నారు-రండు-రక్షింపుఁడు—

గు|రు. మొ. ఎవ్వడొస్తాడేయీడ-కెవ్వడొస్తాడేయీడ!
కెవ్వడొస్తాడేయీడ-కెదిరింపమూతోడ!

చేటి. ఓభూజనులారా! రండురక్షింపుడు.

గు|రు. మొ. కోపమెందుకే చెలీ-కోపమెందుకే చెలీ!
కోపమెందుకే చెలీ-కూకుండిమూట్లాడె!

(విశారదుఁడు ప్రవేశించును)

ఈరోదనంబెటనుండివచ్చెను. అర్జునునిఁ బాసినందున సేఁ జేయు రోదనంబునకుఁ దోడగుచున్న దీరోదనంబు. (నిక్కి చూచి) అదిగో ఒకస్త్రీని ముప్వురు బాలురు బాధపెట్టు చున్నట్లున్నది.

గు|ర. మొ. (మునుపటివలెనే పాడుచున్నారు.)

విశా, ఓహో! (బిగ్గరగా)ఛీ చండాలులారా! యేమిరా యిది—

చేటి. అయ్యా! నాపాలి భాగ్యదేవతభంగి వచ్చినాఁడవు. భూసురవర్యా! చూచితివా యీయల్లరి.

విశా. ఓరీ! మీకుఁబనులులేవా యేమి? పొండు—

గు|రు. మొ. ఓరీ! బామ్మడోయి—

(పాట) బాపనయ్యొచ్చేడు-బాపనయ్యొచ్చేడు!
బాపనయ్యొస్తేను-పారిపోతాననేను.

విశా. నీవుచూడఁగా లొంగినట్లు కానరాకున్నారు. (ప్రకాశముగా బిగ్గరగా) ఓరీ మూర్ఖులారా! ఏమనుకొనుచున్నారురా? మీపేరేమి?

గుర్ర. గుర్రు—

జగ్గో. జగ్గోడు.

అప్ప. అప్పయబాబు.

విశా. ఓరీ! [illegible] ప్రముఖులారా! మీగ్రామ్య భాషా వ్యభిచారిణి మాయాంధ్రభాషా పతివ్రతకుఁ జాల హానికరంబగుచున్నది. ఇంక నట్లుమాట్లాడకుఁడు. మీలో నెవరురా బాగుగ మాటలాడఁ గలరు?

అప్పి. నానుబాబూ—

జగ్గో. అహో-బక్కలు-బక్కలు-(పోవును,)

గుర్ర. ఓకుంద్రా-మా మొగోడినాగ బైలుదేరేవ్-బాబు నానుబాబూ—

అప్పి. కాదు నానుబాబూ!

విశా. ఇది చాల లాభకరంబయినదే—

గుర్ర. అనాక్కాదుబాబూ? నామాటల్లో నాడిమాటలో నెత్తుపల్లాల్తీకెరుకనేదా యేటి?

అప్పి. తమురెరుగరా?

గుర్ర. అనాగయితే మాయిద్దర్కీకాం- మాజగ్గోడి మాట చ్ఛ బామ్మడిమాటనాగుంటాది.

అప్పి. అనాగనాగే. జడ్డోడు మాకన్న బాగాడుతాడు బాబూ!

విశా. ఓసీ! జడ్డీ! యిటురమ్ము ఓసీ! మీరుపొండు-(వారు పోదురు)

చేటి. అయ్యా! మీకు నేఁ జేయు ప్రత్యుపకార మేముండును? మీరీయూరి వారలా?

విశా. కాను కాను. మాదింద్ర ప్రస్థపురంబు

చేటి. మీదింద్రప్రస్థపురంబా? అర్జును నెఱుంగుదురా? అయ్యో మా సఖి యిచ్చటనున్న నెంత సంతోషించియుండును-

విశా. మీసఖి యెవ్వరు?

చేటి. ఉలూచియను నాగాంగన-కాని యర్జునుని - మీరె ఱుఁగుదురా?

విశా. సరి సరి-నేను నర్జునుండును నిక్కడ చేరువ గాంగ సైకతమున జపము చేసికొని యుంటిమి-జపము చాలించి చూడ నర్జునుండు లేఁడు-వానిని వెదకుచు నే వచ్చుచున్నవాఁడను. నీవేమైన నెఱుఁగుదువా?

చేటి. (తల యూచుచు స్మృతి నభినయించి) అక్కడ కూర్చుండి జపము సేయువారలు మీరును నర్జునుండునా? (స్వగతము) తప్పక యులూచి వానిఁ దీసికొని పోయెననుటకు సందియంబు లేదు-(ప్రకాశముగా) ఆర్యా! మీకు బ్రత్యుపకారము సేయునదను దొరకినది. నా వెనువెంట రండు నాగలోకంబున కేగుదము-

విశా. ఆహా! ప్రత్యుపకారము! ఈ భూలోక సంచారంబు

నకే కాళ్లు తేలవైచుచున్న నాకు నాగలోక సంచారము ప్రత్యుపకారమా? చాలుఁ జాలు-

చేటి. అటుకాదు ధూసురవర్యా! అర్జునుండు నాగలోకంబున కేగెను-

విశా. ఆఁ! ఆఁ! నాగలోకంబునకే? వెళ్లిపోయెనా? అర్జునుం డే? అన్నా చచ్చితిరా దేవుఁడా! యింక నేమిసేయుదును. ఉరగీ! నీకెట్లు తెలియును.

చేటి. కొంతసేపటి క్రిందట అర్జునునియం దనురాగముగల్గ నా సఖియు నేనును గంగాతీరంబున మిమ్ము జూచితిమి. అంత నా సఖ నన్నుఁ దోలివేసి తా నటనే యుండిపోయెను. మీరిప్పు డర్జునుండు కానరాఁడని తెలుపుచున్నారు. కానఁ దప్పక సఖి తన మోహనవిద్యచే నాతని నాగలోకమున కుం గొంపోయెను. సందియంబు లేదు.

విశా. అట్లయిన నింక నాతనికి దారలాభంబును నాకు బూరె లాభంబునుం దప్పదు. అట్లయిన మనము పోవుటెట్లు?

చేటి. ఈ బాలునడిగిన ననంతోద్యానమునకుఁ ద్రోవఁ జూపును. తరువాతిది నేఁజేసెదను-

విశా. ఓరీ! జడ్డీ! అనంతునితోఁట నీవెరుంగుదువా?

జడ్డి. బాబూ! వనంతునిదోట నానెరగనా? యీవూర్లో నా నెరగని దోటలున్నాయా? అంతా గాలామేసేసాను గదా? రండిం బాబు సూపుతాను.

విశా. రమ్ము పోదము.

చేటి. చిత్తము.

[ నిష్క్రమింతురు. ]

# ద్వితీయాంకము




స్థలము — నాగలోకము. ఉలూచి
నగరము అర్జునుఁడు శయనించియుండును.
ఉలూచి దూరమున నిలిచియుండును.

ఉలూ. గీ. ఎంతయో సాహసంబున • నితని బట్టి
తెచ్చి నందులకీనాఁడు • తృష్ణదీర
నాదరించునో లేక న • న్నతికతినతఁ
డొలఁగ జేయునొ యేమియోఁ • దోఁచ దకట

ఇట్టిసుందరాకారుఁ డీ నాగలోకంబున నుండునా? ఏమినా భ్రమ-నాగలోకంబున నుండునాయని యాలోచించుచున్నదానను. ఈ రేఁడులోకంబులలో వెతకిచూచిననింతమనోహరాంగుఁ డుండునా? అక్కటా! హృదయమా! ఎన్నినాళ్లకుఁ గృతార్థతఁ జెందితివి? అక్కటా! ఏమినాపాట్లు! దగ్గరనున్నంత మాత్రముననే పొంగుచున్నదానను.

క. ఇన్నియుఁ దలఁచెదఁ; • నెఱుఁగను
యన్నితఁడింకేమి సేయ • నాయంబనునో;
మన్నన దగ్గరఁ దీయునొ
కన్నెర సేయునొ [illegible] • గాఁబొమ్మనునో.

అక్కటా! నన్నంగీ[illegible]న, వడివడిఁ గఱకుటమ్ముల

నురంబుగాఁ జేయు వెడవింటిసామరి సోమరిగాకయుండునే? హా! విధీ నన్నుఁ గరుణింపుము. నాకాభాగ్యమబ్బు నెన్నఁడోగదా!

ఉ. చెక్కునఁ జెక్కుఁ జేర్చి మది ♦ చీదర దీరఁగ ముద్దు గొందు నా
యక్కునఁ జేర్చు భాగ్యమిఁక ♦ నబ్బుటయెన్నఁడొ గర్వితాత్ముఁడై
యెక్కుడు బాధ గూర్చు మరు ♦ నేలుట బంటుగ నెన్నఁ డబ్బునో
యక్కట! దిక్కు లేదు మఱి; ♦ యక్కర తీర్పరె దిక్కు వేల్పులా.

ఓరీ! మన్మథా! అబలనునన్నిట్లేల! కారియపెట్టెదవురా? నీబీరము నాపృథుపీను నర్జునునిపైఁ జూపరాదా? అయ్యో! ఆపని నీవేల చేసెదవు? నీకుమాత్రము బుద్ధిలేదా? పిరికివానిపైని బంటుతనము చూపువాఁడొకఁడొక శూరు నెదుర్చునా? అత్యుగ్రశరంబులలోకంబులఁ గెల్చినవానిపైని నీపూవులును మొగలిరేకులును మంతుకెక్కునా? ఓరీ! పౌరుషవిహీనా! కొంతయైన సిగ్గునందవేమిరా? తాళుము తాళుము—ఆఁ! కదలుచున్నట్లున్నది. నేనుదూరమునందుందునుగాక (దూరముపోవుచు) అక్కటా? నన్ను దూరముగా బోసియుకున్నదిగదా నామనంబు. నిద్రఁ దెలిసిన నన్నితఁడేమిచేయునో? గిరుక్కునఁ దొలంగిపోవునా యేమి? ఇప్పుడేవీనిపైఁబడి నాతృష్ణదీర ముద్దుగొందునా? (ముందునకువచ్చును) హృదయమా నీకేలయింతతత్తరము? తత్తరమున్న నేమి? చేఁ జిక్కినదానిని బారవైచి తరువాత విచారింపనేల? తప్పకముద్దుగొందును. (ప్రయత్నించును)— తాళుము తాళుము:—అయ్యో! నాకీప్రత్యూహాలువచ్చి మనంబుఁ గరఁచుచున్నవి. ముద్దుగొనక మానను. (మఱలప్రయ

త్నింపును) హా! యిదితప్పిదమగునేమో—తప్పిదమా? ప్రాణమంతయు నీతనికర్పించిన తప్పిదమా-(ఆలోచించి) నాథుని యనుజ్ఞలేక తప్పేయగును—ఏమి? నాథుఁడు, అనిపొంగుచున్నదానను—అగును నాథుఁడు కాకేమి? అనాడే కదా హృదయధనమును వీనియాధీనము జేసియుంటిని? ఆఁ! లేవబోవుచున్నవాడు. (దూరమేగును.)

అర్జు. (కనులు విచ్చి తటుకున లేచి యాశ్చర్యము నభినయించును.)

ఉలూ. (స్వగతము) ఆహా! సౌందర్యము-వీనిమాటలు వినదుఁగాక.

అర్జు. ఏమిది కలఁగనుచున్నాఁడనా? లేక యిది యింకొకతావా? విశారదుఁడేడి? (ఇటునటుఁ జూచును)-

ఉలూ. (స్వగతము) నిక్కముగ నితఁ డర్జునుఁడే? ఆహా! పల్కులు? కలకాదు మనోహరా! ఇది నిక్కముగ నింకొక తావు?

అర్జు. సీ. గంగానదీతీర • శృంగారసైకతం
బులుపోయి రానేల • కలుగుటేమి
యూర్మికా నికరంపు • హోరు సొలంగక
కీర శారీకల • గీతలేమి
తమ్ములపైవీచు తెమ్మెరగంధంబు
వోవ నీర్ముగ్గుల • తావియేమి
యేమనూర్చున్న యా • యిసుకతిన్నెలుగాక
వలపుగొల్పెడి పూల • పాన్పులేమి?

గీ. పటుతర ఘన చుంబి ♦ పటములు మాయమై
గొజ్జగిపొదలి చటఁ ♦ గులుకు టేమి?
చిత్రమయ్యె నిదియు ♦ మిత్రుఁడేమయ్యె; న
న్నెందు గానక వెత ♦ గుందె నేమొ.

ఇదికల యెట్లగును? నాయత్నులివిగో తెరచి యేయున్నవి. (తిరిగిచూచి) నిక్కముగా నిది గంగానదీతటముగాదు. కాకున్న నియ్యది యేమగును. ఆఁ! తెలిసినది.

గీ. ఇచటి యలరుల పొదలును ♦ నిచటిచిత్ర
పటములును నవ్యగీతవి ♦ పంచితాళ
నికరముల్ప్రతి కెనయగు ♦ నేర్పుఁదాల్చి
చెప్పకయ చెప్ప నిదియొక ♦ చెలియనగరు.

ఉలూ. మర్త్యూరే వివేకము. అట్లుగదా యుండవలయును.
అర్జు. అక్కటా! ఈభూమి యెవరిదగును—

గీ. ఏనెనడిగాద నియ్యది ♦ యోకిదనుచు
బదులుఁ జెప్పఁగఁ జాలెడి ♦ వారలెవరు
వింతయయ్యెడి నకటయీ ♦ వీటనెవరుఁ
గానుపింపరిదేమొ ని ♦ ర్మానవంబు.

ఏమియో కాని యీయది పృథ్వీతలంబె కాదను సంశయంబు నానుచున్నయది. అట్లగునా (నలుదెసలఁ బరికించుచుండును.)
ఉలూ. ఆహా! సుందరాకారము.

శా. లావణ్యంబిల నెంత గల్గా యది మే ♦ ల్మానవ్య రూపంబు గాఁ
బ్రోవుం గూరిచి పోతఁబోసెనో మనో ♦ మోదంబుతో బ్రహ్మ యీ
తీవి గావున నింక నొక్కనిని స్పృ ♦ షింపంగ లేఁడయ్యె సం
భావింపం గను వేఱు కారణము క ♦ న్పట్టంగ రాదియ్యెడన్.

ఇంకను నన్నుం జూడఁడుగదా యేమి సేసెదను—ఆఁ! వచ్చుచున్నాఁడు.

అర్జు. సూర్యరశ్మి నెఱుంగని ♦ చొప్పఁ దాల్చు
చెట్టు లత్యుష్ణ తీవ్రత ♦ నెగలు గ్రమ్మ
బుస్సురను నాదములు చాల ♦ పొసఁగు నిందు
కాఁగ నొప్పును నాగలో ♦ కంబు గాను.

ఉలూ. (స్వగతము) నిజము నిజము. ఇయ్యది నాగలోకంబే—మే లర్జునా! మేలు నీకీయూహా చాతురి తగియే యున్నది—హృదయమా! తత్తరమందకుము. నీకంత యదృష్టమున్నఁగదా! ఉబ్బెద వేటికి?

అర్జు. (స్వగతము) నిక్కముగ నిది నాగలోకంబే యైన నన్నుఁ దెచ్చిన వార లెవ్వరు? విశారదుని గతి యేమయ్యెను—అక్కటా! విశారదా! ఎంత వెదకుచున్నాఁడవో గదా! నన్నెంత దూరుచున్నాఁడవో కదా! నావల్ల నేరము లేదు. నమ్ముము. అట నీ వెట్లున్నాఁడవో యిట నేను నట్లే చింతలను దురపిల్లుచున్నాఁడను—అక్కటా! నేనేమి చేయుదును. ఇంక నిట్లూరకుంట పాడిగాదు. స్వాతంత్ర్యంబు కల్పించుకొని చెరలాడుదును గాక—(పోవును)—

ఉలూ. (స్వగతము) అక్కటా! యెంత చింతించుచున్నా డు! నేఁ బోయి నమస్కరించి చేసికొందునా? అయ్యో! అది కూడదుగదా నాబోటి మగువలకు-అదిగో మరల వచ్చు చున్నవాఁడు.

అర్జు. (ప్రవేశించి) (స్వగతము) అయ్యో! ఎవ్వరును గాన రాకున్నారు-ఏమి యిది మాయయా! లేక నేను జపమున కుఁ గూర్చున్న స్థలమహాత్మ్యమా?

ఉలూ. (స్వగతము) అవును నిజమే ఒక మగువ యనురా గాతిశయంబునఁ జేసిన మాయయే యిది-అయ్యయ్యో! నే ను మాయఁ జేసితినా? నేనుమా యలాడినైతినా? అక్క టా! నన్నుఁ దలఁచికొనిన నాకే సిగ్గగుచున్నది (లజ్జతో బొ టనవ్రేల నేల వ్రాయును)-

అర్జు. (స్వగతము) అయ్యో! ఏమి విచిత్రము (ఉలూచివంక జూచి) ఇది మఱియు విచిత్రముగనున్నది.

గీ. క్షణము క్రిందటఁ దోచెని • ర్జనము నా కి
నిపుడు కన్పట్టె నీ చాన • యీ లతాంగి
మేలు మేలగు రూపంబు • మేని జిగియు
భ్రామమో లేక నా మతి • భ్రాంతి యొక్కొ!

మతి భ్రాంతి యెట్లగును—

గీ. శిరము కొంత వాల్చి • చేతులు జోడించి
కాలి-వ్రేలనేమొ • నేల వ్రాయు
నట్లు దోచుచున్నదప • రంజి బొమ్మయో?
చిత్ర పటము లోని • చెలువ యొక్కొ!.

కాదు కాదు-చిత్రపటము కాదు-

గీ. అల్ల దే శ్వాసముల మోవి ♦ పల్లవంబు
జేవురింపఁ గఁ దోఁచెడిఁ; ♦ జేలకొంత
వక్షమున లేచి పడుచుండె ♦ వనిత గాని
భ్రాంతి కాదిది చిత్రిత ♦ కాంత గాదు.

ఆహా! యేమి యీసోయగము-

చ. దివిజుల కాంతియేని కడు ♦ దివ్యము లిందుగ్రిని వేయిగన్నులీ
యువతి భుజంగియేని విను ♦ నొల్లుని తన్ముఖముండ నాయదో
భువనము; మర్త్యయేని కడు ♦ పూజ్యులు గారటే మానవుల్గఁజా
నవ మదనాస్త్రిమోయనఁ ద ♦ నర్చెను నీసతినాదు మాడ్కికిఁజా

అవునవును నిజము తెలిసిది.

గీ. శిరమునందున మణికాంతి ♦ పరఁగు చుండు
శ్వాసముల యందు సీత్కార ♦ భావమెనయు
పాప పూఁబోఁడి గానోపు ♦ వనిత యిదియు
నురగ లోకంబు కాదొకో ♦ యరసిచూడ.

ఈలోకంబునఁ జంద్రుఁడు లేఁడని బ్రహ్మను జడుఁడం
ఘురు గాని-

గీ. అందముగ నీ సతీముఖ ♦ చంద్రుఁడుండ
దళుకు తళుకను మేల్నఖ ♦ తారలుండఁ
జంద్రుఁడేటికి తారల ♦ బృందమేల
నీయధోభువనంబున ♦ నాయముగను.

ఇంక నీ కాంత నడిగిన నామది సంశయము వాయు

ను (ప్రకాశముగా) కాంతామణీ!

ఉలూ. (మాటాడకుండును.)

అర్జు. (స్వగతము) అయ్యో! ఎంత మోసపోయితిని-నిక్కముగ నిది జీవితాంగనయేయని పిలిచితిని. చిత్రరూప మెందయిన బదులు పల్కునా? నాకు మతి భ్రాంతిగల్గినఁ గల్గును గాని చిత్తరువున కెందైన మాటలు వచ్చునా అహా!

గీ. ఇట్టి పటమును నిర్మించు నట్టి వాఁడు
ధన్యుఁడాయెను ముమ్మారు ధన్యుఁడాయె
ఏ చెలియ చిత్తరువోయిది! యాచెలియను
గాంచుపుణ్యంబు నాకిఁకఁ గలుగ దేమొ.

ఆహా! ఇట్టినాతిం బెండ్లియాడిన వానిదిగదా భాగ్యము-

ఉలూ. (స్వగతము) హృదయమా! తత్తరమందకుము- నీ కేలయంత తందర?

అర్జు. (స్వగతము) ఎంతయందముగ నున్నది-చేరిచూతును గాక-(చేరఁబోవును)-

ఉలూ. (దూరముగాఁ దొలంగును)-

అర్జు. (స్వగతము) ఏమిది మోసమునకు మోసము! నిక్కముగ నిది జీవితాంగనయె-తన్వీ!

గీ. ఎవ్వతెవునీవు? యియ్యది యెవరి నగరొ?
నన్నిచటి కేరుదెచ్చిరో నాదు సఖుని
నెచట నుంచిరొ నాకిది యెల్ల నెక్కు
నాట్లులోపలఁ దెల్పుము తేట పడఁగ.

ఉలూ. (నవ్వును)

అర్జు. (స్వగతము) ఆహా! నగవు! చంద్రా! నీబ్రతుకు నగుబాటాయెఁగా (ప్రకాశముగా) తన్వీ త త్తరంబున నేనడుగ నీవు నగవులా?

ఉలూ. మనోహరాంగా! ఇన్నిప్రశ్నంబులకు నుత్తరము నొక్కమాటలోఁ జెప్పనెవరితరము. అందు ముగ్ధలమగుమాకెట్లు సాధ్యమగును-

అర్జు. తన్వీ! త త్తరంబున నడిగితినిగాని వెయిమాటలలోనే చెప్పుము- (స్వగతము) నీపల్కులు పచ్చకర్పూరపు పల్కులేగదా!-

ఉలూ. వసుమతీతలరతీమనోహరా! వేయిమాటలాడ నబలలమగు మాకుఁదగునా? యెట్లయినను జెప్పెద- క్షమింపవలయును- నేనులూచియను నాగాంగనను.-

అర్జు. (స్వగతము) నాయూహనిజమే- (ప్రకాశముగా) ఈ నగరెవరిది?

ఉలూ. ఈనగరునాయదియే?

అర్జు. (తలయూఁచి) నన్నెవ్వరు తెచ్చిరి?

ఉలూ. తప్పయిన సైరింపవేఁడెదను. మోహనాంగా! అది నాయనురాగాతిశయము జేసినకార్యము.

అర్జు. (తలయూఁచుచు) అట్లా! సరే! మరివిశారదు నేమి చేసితివి?

ఉలూ. ఆయన నచటనే యుంచితిని. వలయునన్న నాచెలింబంచి తెప్పింతును.

అర్జు. (స్వగతము) అయ్యో! విశారదా! యెంతవిచారించు చున్నావో గదా- (ప్రకాశముగా) మోహనాంగీ! నన్నేల తెచ్చితివి?

ఉలూ. సుందరాకారా! నిక్కముపల్కెదవినుము- నాఁడు ద్రుపదుని మత్స్యయంత్రంబు వడ నేసినవాఁడవని పలువురురగీయువతులు నిన్నుఁ బొగడ నీపైననురాగంబు నొందితిని. ఇన్నినాళ్ళకు గాంగసైకతంబున నిన్నుఁ బొడగాంచు భాగ్యంబు గల్గినందుల కెంతయు సంతసించి నిన్నిటకుఁ దోడితెచ్చితిని. నేను కాదు నిన్ను తెచ్చినది. అమితమైన నా యనురాగము. క్షమింపవలయును.

అర్జు. హాయిరే! నాయదృష్టము.

(స్వగతము) గీ. నాగయువతిఁ జేయ • నాతివేఁడుచు చాలు
గగన చారిఁ జేయఁ • గానె చాలు
నవని కాంతఁ జేయ • నాపెయుండె చాలు
నిట్టి మోహనాంగి • నెందుఁ గందు.

గీ. మూఁడు లోకంబు లేలెడి • మోహనాంగి
వలచి వలపింప జేసెడి • వన్నె కత్తె
కోరి నన్నిటఁ దెచ్చిన • కోమలాంగి
యబ్బె ధన్యుఁడ నయితి నే • నవని యందు.

(ప్రకాశముగా) ఉలూచీ! భూలోకంబున జపము జేసెడి నన్ను నీవు తెచ్చితివిగదా- మగువలకింత సాహసముండఁదగునా?

ఉలూ. అనురాగాంబుధి నీదుచున్న వారలెట్టి సాహసం
బునకయిన నొడిగట్టెదరుగదా?

అర్జు. తే. ధ్యాన గాంగ తటిని ♦ జపముఁ జేసెడి నన్ను
వ్రతిగ నెంచ కిటు ♦ వాంఛఁ జేసి

ఉలూ. కాదు కాదు—మనోహరా! అట్లనఁబోకుము.

బడలి, లోనఁ దాప ♦ మడరఁ జేయఁగఁ జొచ్చె
కాన నిట్టి వాంఛఁ ♦ బూన వలసె.

అర్జు. గీ. కాముకునిగ నెంచి ♦ కట్టి తోడ్తేరంగ
తగునె మగువలకును ♦ తప్పు గాదె.

ఉలూ. నీదు చేతలెల్ల నే ♦ నెఱుంగుదు గాన
నమ్మఁగలనె నిన్ను ♦ నంగరూప.

భువనైక మోహనరూపా! అట్లనఁ బోకుము—ఎన్ని
యో దినములు నిన్నుఁ జూచుభాగ్యంబు గలుగమి నీమనోహ
ర రూపంబు నేవినినభంగిఁ జిత్రించి దానిపైఁ జూడ్కులంబర
పి యానందాబ్ధి నప్పుడప్పు డోలలాడుచుందును. రమ్ము! నా
కోర్కెదీర సంగీకరింపుము.

అర్జు. ఉలూచీ! నేనేపనిపై నిల్లువెడలితినో నీవెఱుఁగుదువా?

ఉలూ. ఎఱుఁగకేమి? సమయాను సరణంబుగ గోప్రదక్షి
ణార్థమెగాదా?

అర్జు. గీ. మగువ యిన్ని తెలిసి ♦ తగు నటే నన్నిట
దెచ్చి కలయఁ గోర ♦ విచ్చల విడి

ఉలూ. యెఱుఁగు కతనఁ గాదె • యెంతయు నడి కోర్కి
ధీర నగుచు నిన్నుఁ • దెచ్చియుంట.

అర్జు. అన్య కాంత గూడ • నర్హమె నృపులకు?
అందు నాకు ధర్మ • జానుజునకు

ఉలూ. కాదు కాదు రాజభూషణా!

అంత నీవె యంటె • సత్యంబు లేదంటె;
ధర్మ పదము జూడు • దయఁ దలంచి

ఆనాఁడేకదా! నామనంబున కధి నాథుండవయితివి?

అర్జు. అందులకేమిగాని త్రైలోక్యసుందరీ!

ఉత్సాహము. ఈవు చూడ భుజగి వౌదు • నేను జూఁడ మర్త్యుఁడన్
ఏ విధమునఁ పొందు గలుగు • నిరువురకు లతాంగిరో.

ఉలూ. వావులేల వాంచలున్న • వలనులేల చూడగన్
గావఁడే, పురుకుత్సుఁడురగ • కాంత నర్మదాసతిన్.

ఏలతప్పించుకొనియెదవు? గంగాతీరంబున నిన్నుఁజూచినప్పుడ నీపైబడ నెంచితినిగాని నామనంబునకది తగదనినిందించి యింతవరకు వేచియున్నదానను. నన్నారడిసేయ నీకుం దగునా?

అర్జు. (స్వగతము) హా! గంగానదీతీరమా! ఎంత చేసితివి?
(ప్రకాశముగా) అటుకాదు— మనోహరాంగీ!

గీ. పాండు వంశజుండు • పార్థుఁడు ధర్మజు
తమ్ముఁ డింద్ర సుతుఁడు • తగవుమాలి

కామమునకు లొంగి ♦ యామరు తాళనిఁ
గూడెనన్న సిగ్గు ♦ మూడు గాదె.

ఉలూ. అక్కటకటా! ఇంక నేనెంతని వేడుదాన! లావణ్యాంబునిధీ! ఇన్నియు ననవలసియుంటిగాని నీ వెఱుంగని ధర్మకర్మములున్న వే? ఇంకనన్ను మరుబారినుండి తొలగించి రక్షింపుము—

అర్జు. ఉలూచీ! నన్నెంత దవ్వులకుఁ దీసికొనివచ్చితివి?—

ఉలూ. అందులకైననన్ను కరుణింపరాదా? (స్వగతము) ఈమూర్ఖబ్రహ్మ వట్టి జడుఁడు సుమా!

గీ. మాటలన్నను దేనెల ♦ తేటలొల్కు
మోము వెన్నెల మాఱని ♦ మామఁ గేరు
మేనుదూరును కమ్మక ♦ డానిడాలు
గాని మనమన్న శిలకలె ♦ కఠినమయ్యె.

అక్కటా! ఇట్టిసృష్టినిఁ జేసినందుల కాబ్రహ్మను పూజింపకుంటయే యాతనికిఁ దగినశిక్ష—

అర్జు. తన్వీ! యిప్పుడు నేను నిన్ను నిరాకరించిన నీవేమి చేసెదవు? యెరుంగకుంటి మనంబొప్ప కున్నయది—

ఉలూ. దీనికాలోచనయేల? నీకర్పింపఁబడిన యీమేను నీ పాదములయొద్దనే విడుతును. మనోనాయకా! నన్నారడి సేయనీకుఁ బాడియా? నేఁజేసిన నేరంబుల క్షమింపుము— (అర్జునుని పాదంబులపైఁబడును)

అర్జు. (స్వగతము) గీ. అకట చెలియ దేహ ♦ మంఘ్రులఁదాకిన
పరవశతనో యేమొ ♦ యొరిగెనింతి

దేహ మెరిగియుండ ♦ బాహు మూలరుచులు
కనులు గల ఫలంబు ♦ గలుగఁజేసె.

అయ్యో! ఇట్టి సుందరాకారంబున కిట్టియవస్థ గూర్చి నేను మహాపాతకుఁడనుగదా! (ప్రకాశముగా) ఉలూచీ! రమ్ము! ప్రాణప్రియా! లెమ్ము-(లేవనెత్తుచు) ప్రాణమా! విలాసార్థంబుగ నడిగినదియెల్ల నమ్మి నీవిట్లు చింత నొందుట తగవా?

ఉలూ. (స్వగతము) హృదయమా! కృతార్థతఁ జెందితివి—

అర్జు. ఇపు డెంత కాలమైయుండును—

ఉలూ. చ. గోల గోల లాడుచుఁ బులుఁగు ♦ గూటను బిల్లలనుంచి మేతకై
వెలుపలరాఁగఁ జూచి కను ♦ వెట్టుచు నుండిన గంతుపుల్గు దా
వలపునఁ జేరఁబోవ నది ♦ పారఁగఁ జూచి యనంత చింతతోఁ
బలుకఁగలేక కుయ్యుమని ♦ ప్రక్కకుఁ బోయెడి నెక్కలార్చుచున్.

దీనం జూచి ప్రాతఃకాలమాసన్నమయినట్లున్నది—

అర్జు. ఆఁ! ఏమి? ప్రాతఃకాలమా? యేమిది నూతనకాంతి యేమియు లేదు గదా యీలోకమున-(వినుట నభినయించి) చంద్రాననా! వింటివా ఆయలుకుడు - అదేమియగును?—

ఉలూ. (విని) అక్కటా! నాచెలి ఆక్రింది యుపవనంబులోనికిఁ బోవుచు నన్నుగూర్చి యెవ్వరినో ప్రశ్నించుచున్నది—

అర్జు. ఆ యుద్యానవనంబున నిన్నుఁ గానక యిందులకు వచ్చునుగదా!

ఉలూ. వచ్చిన వచ్చు-

అర్జు. అట్లయిన నే నెటనుండవలయును.

ఉలూ. ప్రాణప్రియా! యీచెంతనున్న పడకటింటికి బోయి యుండుడు-దానితో మాట్లాడి వచ్చెదను.

అర్జు. ఒంటరిగాఁ బోవ భయమగుచున్నది-నీవును రమ్మా-మన మిరువురమును బోదమా శయ్యాగృహంబునకు?

ఉలూ. ఏమేమి? సర్వలోకంబుల నుక్కున జయించుమేటి వగు నీకు నొక శయ్యాగృహంబున దాగియుంట యొకభయమా? ఇట్టివాని కిదియా సమయము-దయచేసి పొండు-

అర్జు. నాకెన్నఁడును నెదిరినిల్చుట యలవాటగుట దాగియుండుటకు భయంబగుచున్నది-రమ్ము మన మిరువురము బోదము నీచెలి వచ్చి యెవ్వరును లేరని మరలిపోవును. (అని లాగికొని పోవును)

[ ప్రవేశము చేటి ]

చేటి. అక్షియుగమా! కృతార్థత జెందితివి. నాగలోక యువతీ భూషణంబగు నులూచియు, భూలోకపురుషాభరణంబగు నర్జునుండును కలసి నే జూచెదనన్న భయంబున నాగీకునఁ బుచ్చుచున్నవారు. పోయి విలంబుకాకుండఁగ నే పిల్చెదనుగాక—(తలుపునొద్దకేగి) అక్కటా! గడియయున్నది. ఇదియర్జునుని సేఁతయేయగును. అమ్మా ఉలూచీ! ఒక్కింతయిటురమ్ము—

ఉలూ. (లోపలనుండియే) చేటీ! ఇదిగోవచ్చుచున్నాను.

చేటి. ఇదిగో వచ్చెదవా! (స్వగతము) యేమియో యచ్చట జేయుచున్న యా ఘనకార్యంబు (ప్రకాశముగా) చెలీ! జనకులు నీ కొక వార్త బంపిరి—రమ్ము—తెల్పెదను.

ఉలూ. (లోపలనుండియే) చెలియా! ఇదుగో వచ్చుచున్నదానను— ఈప్రియమైన భూషణంబు నక్కు రానీయకున్నది.

చేటి. (స్వగతము) ఆభూషణంబు కిరీటియా! భూషణంబుగ నొడలునుంచుకొననా తలంచుచున్నదానవు! (ప్రకాశముగా) ఆభూషణమేమియో చూచెద. తలుపుతీయవమ్మా వత్తును ఎటురానీయదో చూచెద—

ఉలూ. (వీడినకొప్పుతో త్వరగవచ్చి) చెలీ! యేలనే అంత తొందర? ఆరాజకార్యమేమియో తెల్పరాదా?

చేటి. మరియేమియు లేదు. జనకులు వివాహంబునకు నిన్ను సిద్ధముగ నుండుమని సెలవిచ్చిరి—ఇదిచెప్ప దత్తరంబుండదా?

ఉలూ. సఖి! పెండ్లి పెండ్లి-యని యేలనన్నూరించెదవు?

చేటి. ఇంకనట్లననేల? అంతయు సిద్ధముగనేయున్నది-కాని- చెలీ! ఉలూచీ! నీక్రొమ్ముడి వీడియుండుటకు గారణమేమి?

ఉలూ. చెప్పితిఁగదా ఆ కంఠాభరణంబు తీయనాక్రొవ్వద యందుఁ జిక్కుకొనినది. ఆచిక్కును దీసికొనుచుండ నీవు తత్తరంబునంబిలిచితివి.

చేటి. (స్వగతము) ఆకంఠాభరణంబు కిరీటియా; ఇదియా చిక్కు? (ప్రకాశముగా) అయ్యో! నిగనిగలాడు కెంపునకుఁ దులఁదూగు నీయధరమేమియో నేఁడు అర్జునభావం

బు గనుపట్టఁజేయుచున్నది.

ఉలూ. (అర్జునునపుడు తలుపువంకఁ జూచును) నీవేలనో యింత తత్తరంబునఁ బిలుచుచున్నదానవను భయంబున న ట్టులాయెనేమో— చెలీ! అంత వాఁడియున్నదటే నామోవి?

చేటి. సఖీ! యింకనీవు నరసతివై తిరిగదా—

ఉలూ. (నరయనునపుడు తలుపువంకఁ జూచును) ఏలనే న న్నట్లు హాస్యమాడెదవు?

చేటి. ఇదియొక హాస్యమా? నీవుకంఠాభరణంబుమీఁద చె ప్పిన గాథయంతయు హాస్యముగాదా?

ఉలూ. అట్లయిన నీవట్లనుటకుఁ గతంబేమి?

చేటి. ఆప్రశ్న నన్నిప్పుడే యడుగరాదా? యీఁడొంకతిరు గుడేల? అదిగో క్రిందచావడిలో ధర్మజుని పురోహితుని పు త్రుండట యేమియో కార్యంబుపై నీతో మాటలాడవచ్చి నాఁడట—

అర్జు. (తలుపుదీసికొని తనలో) విశారదుఁడే! యీనాగలో కంబునకే వచ్చెనా? భయంబువాసె. తదేకచింతతో నిం కకొన్నిదినంబు లిచట నుండవచ్చును.

ఉలూ. నాతోమాట్లాడుటకా! పోయి రమ్మనుము.

చేటి. (పోవును)

అర్జు. ప్రాణమా! (యెదురుగవచ్చి) ఇంకనీబాగుడుమాటలే ల? విశారదునకు మనమిరువురముకానవచ్చుటయే యుత్త మము.

ఉలూ. అటుకాదు—ప్రాణనాథా! మనవిశారదునితోఁ ద

గుమాటలాడి అతని నిటనేయుండుమని, మీ సమాచార
ము గనుగొనఁ జాలలంబంచినట్లు నటించి తరువాత మి
మ్ముఁ జూపినఁ బాగగును.

అర్జు. ఓహో! నీయూహాచాతురి—వచ్చుచున్నాఁడుగాఁబో
లు నాస్నేహితుఁడు అక్కటా! చూడక రేటుతాళ
గలను?

ఉలూ. నామాటవినుఁడు—మీరా గృహంబునకుఁ బొం
డు. నేనన్నియుఁ జక్కఁజేయుదును.

అర్జు. అంతయు నీపై విడిచితిని. (పోవును)

(ప్రవేశము విశారదుఁడు, చేటి.)

చేటి. అమ్మా! యులూచీ ఈతఁడే విశారదుఁడంట

ఉలూ. భూసురవర్యా! ఆసనము నలంకరింపుఁడు.

విశా. (స్వగతము) అర్జునునకు తగియేయున్నది. (ప్రకాశ
ముగా) మీమన్ననలఁ గాంచునంతటివాఁడనా? (అనికూ
ర్చుండును.)

ఉలూ. విప్రాగ్రగణ్యా! ధర్మజునకును దదనుజులకును
సేమమా?

విశా. (స్వగతము) ఈ యర్జునుఁడింకను దో బూచి యను
చున్నాడు-(ప్రకాశముగా) ధర్మజ-భీమ-నకుల, సహదేవు
లు-కుశలముగ నున్నారు-మిగిలినవారి సేమ మడుగఁగోరి
యే నే నిటకు వచ్చుట-ఏడీ? యర్జునుఁడేడీ? యెక్కడ
కానరాఁడు.

ఉలూ. అదియేమి భూసురవర్యా! అటులనుచున్నాఁడవు?

నాగలోకంబేమి? అర్జునుఁడేమి?

చేటి. చెలీ! యీయనకు మతిపోయినది కాఁబోలును-బ్రాహ్మణోత్తమా! మతిపోయినదా యేమి? ఇది నాగలోకము. ఈమె యులూచి-నాగరాజు కూతురు.

విశా. ఆఁ! అదియంతయు నాకు తెలియును. నాగరాజకుమారీ! మాయర్జును నెదుట నుంచెదవా? లేక నన్ను నా యిచ్ఛవచ్చినట్లు జేయుమందువా? త్వెమ్ము అతని నిట నునుపుము-

చేటి. ఉలూచీ! ఇదేమమ్మా యిట్లనుచున్నాఁడు? వెఱ్ఱియేమో?

విశా. ఏల యింకఁ జూచుచున్నవారలు-ఊఁ! కానిండు,

ఉలూ. విప్రసత్తమా! అర్జునుఁ డిచట నెట్లుండును?

విశా. ఆఁ! ఏమి? అర్జునుఁడిట నెట్లుండునా? సరియా? నా దివ్యదృష్టిప్రభావము మంటఁగలసిపోయినదా? నేఁజూచినదంతయు మిథ్యయాయెనా? ఆఁ! ప్రచండంబగు దివ్యదృష్టి నాయందుండగనే జూచినది మిథ్య యెట్లగును? తెండు! అర్జును నిట తెండు-

ఉలూ. (తెలతెలఁబోయి చూచును)-

చేటి. అమ్మా! యులూచీ! నీవట్లుండకమ్మా! నిన్ను జూడ నాకు భయమగుచున్నది-మనము బయలువెడలిన వేళ మంచిది కాదు కాఁబోలు విశారదా! మే మేపాప మెరుగము-మాపై నేలకోపించెదవు?

విశా. ఏపాప మెఱుఁగరా? మీరు మోహనవిద్యచేఁ దీసికొ

నివచ్చుట నాకు దృగ్గోచరంబు కాదని యెదరా యేమి?

చేటి. ఉలూచీ! నీవేమయిన నెఱుంగుదువా? తెలుపవే-

ఉలూ. నే నేపాపమెఱుంగను-ఛీ నీవెను వెంటనేగదా నే వచ్చితిని నే నేమి సేయుదును-

అర్జు. (తటాలున వచ్చి) (చేటితో విశారదుని తాళుమని చెప్పుచు) (ప్రాణమా! భయమేల? విశారదా! నేమమా?

చేటి. అమ్మా! యీతఁడెవరే? భయమగుచున్నది-

అర్జు. నే నే యర్జునుండను-

చేటి. అమ్మా! యులూచీ! ఇంతదనుక నీగీమునసుంచియే యన్ని పల్కులు పలికితివి. ఎంతజాణవే?

అర్జు. హృదయమా! ఊరడిల్లుము. విశారదుఁడు టక్కరి గదా.——

విశా. సరియా? నేనాటక్కరిని? మోహనవిద్యచేఁ దీసికొను వచ్చువారు టక్కరులుగారా? వచ్చి లోలోపల డాగియుండి చిత్రంబు జూచువారలు టక్కరులుగారా? తుదకు కానరాని మిత్రుకొఱకుఁ గానలఁ దిరిగి బిలంబులఁ జొచ్చి పడరానియిడుములఁ బడిన నేనుటక్కరినైతిని? చాలు చాలు నేఁ బోయెదను——(పోవును)——

అర్జు. ఆఁ! ఆఁ! విశారదా! తాళుము-నేనునువచ్చుచున్నాఁడను. కోపమింతతగునా? (అని వెంటబోవును)——

చేటి. అమ్మా! యులూచీ! నాకెఱుక నేసిననింత యారాటమేలగల్గును? ఉలూచీ! నేవన్నియు నెఱింగి జనకులయొద్దకుఁ బోయి యీశుభంబుఁదెల్పి వానినానందమున ముంచి

మైత్రివివాహంబున కుత్తరవునంది వచ్చినదానను—రమ్ము—భయమందకుము—

ఉ.బూ నాహృదయశల్యంబు నీకతన నిర్మూలంబయ్యె రమ్ము.

[నిష్క్రమింతురు.]



# తృతీయాంకము.

స్థలము — ద్వారకాపురంబు చేరువనొక
యటవి. ప్రవేశము — మానిరూపంబున
నర్జునుఁడు, విశారదుఁడు —

విశా. హా! విధీ! నీకార్యములెల్ల నతిచిత్రములుగదా! ధనంజయ నామార్హుండగు నొక ధీరుని బేద బాటసారిగాఁ జేసి, అదిగాక స్త్రీలోలుండై యిండ్లలో నొదుగునట్లు చేసి, చిత్రాంగద చూపు తూపులకు మనంబిట్టిట్టు గానిచ్చి యింకను తృప్తినొందక అకలములుదిను తాపస వృత్తియుఁ గూడ నందనిచ్చితివిగదా! ఇంక నాగతికి నేనేమి విచారింప వలయును — "మహాగజాః పలాయంతే మశకానాం తు కాగతిః."

అర్జు. విశారదా! నీయూహ సరియైనది కాదు — ఏలయనఁగా —

గీ. పాలకై గాళ్లుమోయుట ♦ పాడిగాదె?
పలికెదేటికి నిట్టుల ♦ బ్రమ్మటించు
బాల యీలీల నిమ్మోని ♦ పాలగుటకు
నెట్లు కడగండ్ల పడుటయు ♦ నిష్టమగును.

విశా. పెండ్లియాడుటకై మునివృత్తి నెవ్వరైన బూనితిరే? ఆవెనుక నల్వురు నిన్ను నవ్వరే? —

అర్జు. ఏల నవ్వెదరు? ఆకాంత సోయగంబుఁ గాంచిన నీవి
ట్టులనఁబోవు? ఎఱుంగనివాడవు గాన నీరీతి గోలవయి ప
లుకుచున్నాఁడవు-

సీ. శైవాల చికుర నా◆ ననమీక్షించిన
మదిజిక్కు గొననియా◆ మౌని యెవఁడు
బింబాధరోష్ఠి నా◆ వెలఁది నీక్షించిన
ననురాగ మందని◆ యతి యెవండు
కనకాంగి నారాజ◆ కాంతనీక్షించిన
తాపమందనియట్టి◆ తపసి యెవఁడు
రత్నవల్లరి రాజ◆ రమణి నీక్షించిన
వెనకువ గోరని◆ ముని యెవండు

గీ. పద్మముఖిఁజూచి తమిచేత◆ బట్టరాని
యుడుములం బడి జీవ◆ మిస్సీయటంచు
రోసి తపమెల్ల శాపంబు◆ జేసికొనుచు
నిగురుబోడిని వేడని◆ ఋషి యెవండు.

అట్టి సుందరాంగినిఁ గోరిన నన్నేల పరిహాసించెదరు-
విశా. (తనలో) ఆహా! తర్కమా! నీవొక తాటిపట్టైనయు
తివిగదా-అది యట్లుండనిమ్ము-ఉలూచి యుంటనున్న భ
క్ష్యంబుల సందడిని శ్రమలెల్ల మరచి యెటులనో కాలం
బు వెళ్లబుచ్చితిని-ఇంక నిక్కడ నెట్లుందును? (ప్రకాశ
ముగా) అర్జునా! రాజితరాజాన్నంబుల భుజింప నలవా
టుపడిన నీవీ యాకుల నెట్లు రుచింప గల్గితివి?

అర్జు. రాజిత రాజాన్నంబులు పోయిన నేమి? రాజితరాజా నన గల్గు గదాయని

విశా. అట్లనా! నాకునట్లేమయినంగల్గిన నేనును అలవాటు పడియుందునుగదా-

అర్జు. కానలెనన్న నీకుండగిన యువతిం దేలేనా?

విశా. ఊఁ! హూఁ! వద్దు వద్దు-నీ కాశ్రమ యక్కరలేదు-కావలెనన్న నాకును మార్గము తెలిసినది.

అర్జు. అదియేమి? ఆమార్గము-

విశా. నీవు చెప్పినదే-వేషాని కొకవెలఁది-

అర్జు. (నవ్వుచు) విశారదా! పోయి ఫలముల నెమకు కొందమా?

విశా. నేనింక నడువలేను-నీ వాతట్టున బొమ్ము-నే నీ దగ్గర చెట్టుఁ జూచికొనియెదను-

అర్జు. అట్లయిన నేను నిక్కడనే యుండెదను-

విశా. ఆఁ! ఆదిగో-బిచ్చపుఁ గూటిలో శనైశ్చరుని భంగి యీాయున్న కోంచెము పండ్లకయిన నన్నుఁ దిననీయవా?

అర్జు. నీకిష్టములేకున్న నేనే బోయెదనులే (అనిపోవును)

విశా. అంతకన్ననా (అని చెట్లవైపున దిరిగి) ఆ హరిశ్చంద్రుఁడు నలుఁడు నెట్టిపాట్లుబడిరో నాకిప్పుడు తెలియవచ్చుచున్నది-చెట్లుసహితము నాపైని పగఁబూనియున్నవి-లేకున్న నీ పాడుచెట్లను శిఖరమునకున్న పండ్లు క్రిందికొమ్మలకుండరాదా? అక్కటా! తా ననుభవింపక యొరులకీయ్యక దాచులోభులగతి నున్నవిగదా యీకుజములు-ఏమిచే

య వలనుకాదు-చెప్పక తప్పదు. (చెప్పకబోవును)

[ ప్రవేశము కొందరు వేటకాండ్రు. ]

అందఱు. (పాడుదురు).

ఈ యేటికి యేటీ యేటీ-యీ యేటకు సరి యేయేటీ
బెబ్బులి సింహాము వేళ్లన్నన్-అబ్బబ్బబ్బబ్బబ్బబ్బ
దెబ్బలు కొడుదుము కత్తులతో-బొబ్బ నెట్టి చనిపడిపోవంగ
దున్నలు పందులు కుందేళ్లుగ-అన్నన్నన్నన్నన్నా
తిన్నగ పొడుతుము యీ శెలతో-మన్నన పడియు విమడియంగ

పథ. ఓరుండ్రా? నానంతె తోల్తుక పులిన్నొసాన్రా. అది పులంతే పులంటా వేటి-పెద్దయ్యాగ్రంనాగున్నాదిరా-

ద్వితీ. అది యాగ్రమ్మంతావుగాని నాన్నొసింది మరింత యాగ్రంనాగున్నాదిరా.

ప్రథ. ఓరి! నువ్వుండ్రా! నాను సెప్పనియ్యరా—యెనకాతలనువ్వ—యీడిమాట కేట్రా! అదియాగ్రమేన్రా! నానెరుగ నేటి? యాగ్రమే-ఆయితే యాగ్రంనిన్ను సూసింది-సూసిపిల్లి నాగ గుద్దుకుపోతున్నాదిరా. ఎందుకంతా వేటి? గోసి, గట్టిగెకట్టి యిందలిసె, యిందలకత్తొట్టకొని నిల్సుంతే దానికంటికొక ముర్గంనాక్కనిపించేనేన్స-నా నేటి సేశానంతా వేటి? కత్తుచ్చుకో గిర్రున్దిప్పి గిరిమీదకొట్టినానుగదా-మెడనడిపెట్లకి రెండుముక్కలయిపోయిందిరా-

ద్వితీ నాను సేసిందింతకన్నా యింతరా! మరంతే యేదుపంది

కళ్లు మిణకరించుకొని కొట్టుకొస్తున్నాదోస్. నన్నుసూసి
దిరోయి. రొండేనగువులేసిందిరో! అట్టేసూశానుసూశాను
ఈటినాగట్టి భీముడునాగనిల్సున్నాను. ఆయీటిమీద
ద్దాదిరోయి. పడిగిజగిజగింజుకొని పాణంలోక్సేసింది—
తృతీ. నన్నన్నన్న–న్నాను సెస్సెస్సె–సేసిందంతే–వి విస్సి విస్సి–
మీరంతా–గగ్గగ్గ–గాబరాయిపొప్పొ–పోతా(రా
ప్రథ. నువ్వు నత్తోడివి–నువ్వు కొట్టేదేటూరుకోరా
తృతీ. నన్నన్న… న్నానత్తోడయితే–నాకక్కక్కత్తికి–నన్న
న్నత్తిరా? దెబ్బకొడితే సిన్నిన్నిన్ని… న్నితాత్త… త్తాత
ల్లాటోలు కొక్కొక్కొక్కొట్టలేరు–ఎయ్యె… యేటను
కున్నావు?
ద్వితీ. అయినయిసెప్పరా–
తృతీ. యియ్యి… య్యాందుకే నన్న… న్నాకోపం వొవ్వొ
… వొస్తాది–రాజుగోరు… నన్నన్న–న్నాకెంతదయో సిన్ని
… న్నికెరికా?
ప్రథ. అవును సెప్పమంతే యిదెందుకేటి?
ద్వితీ. అంతున్నకొద్ది అనాకే యిగతాలాడతా(డా–
తృతీ. యియ్యి… య్యెగటాలొద్దు సెస్సె… స్సెప్పొద్దు
—నా కక్క… క్కత్తుంటే చాచ్చ… చ్చాలు–నన్నన్న
కడి లల్ల… లచ్చెమేటి?
ప్రథ. అయితే సెప్పవురా?
తృతీ: నాకా సెస్సె… స్సెప్పను…
ద్వితీ. అయితే రారా–యేటాడ్డం–యియ్యేల సూబద్దరమ్మ

మరంతే సత్తె బామగోరు వొచ్చేరుగదా-

ప్రధ అయిన్గోయి-లావిన్నిసంపుకెల్తే సంతోసిత్తారు--రం
డోసి ...

తృతీ. నాకక్క ... క్కత్తుంటే సుస్సు ... స్సుబద్దరమ్మకాదు
బబ్బ బ్బమ్మదేముళ్ళొచ్చినా బబ ... బయ్యము లేదు ... రర
... రాండి ...

అందరు. (పాడుదురు)(పోదురు) ...

విశా. మహాప్రభో! యెవరునాయనా పీరలు? నాప్రాణము
లు దీయవచ్చిన యమభటులనలె నున్నారు. కొంపదీసిన
న్ను చూతురేమో? ఆ! ఆ! నావైపే వచ్చుచున్నారు.
దేవుడా! యీరాక్షసులనుండి యేలాగున తప్పించెదవో-
శ్రీహరీ! కాళ్లునిలువకున్నవిగదా నేనేమిసేయను-యీలా
గున యుండెదనుగాక (అనిపిల్లివలె నొదిగియుండును) ...

అందరు. (పాడుచు దిరిగివత్తురు)

తృతీ యియ్య ... (చేతితో విశారదునిచూపును) ...

విశా. ఓరీ! నీకాళ్లుకాకులెత్తుకపోను నన్నుచూపించుచున్నా
వేమిరా? దౌర్భాగ్య! నీకునేనేమి విషముపెట్టినానురా?

తృతీ. ... ... యియ్యింత రరర్రోయి-

ప్రధ యేటిరో యేటిరోయ్.

ద్వితీ. ఓరోస్ ముర్గంనాగున్నాదిరా—

తృతీ. హూత్ హూత్ క ... కడల్దొస్-

ప్రధ. ఓరుంవ్రడా (అనివెళ్లును)

విశా. ఓరీ! తుచ్ఛులారా! సరియా పడ్డారునామీద—అర్జు

నా! నీకిష్టప్రాప్తియు నాకుకష్టప్రాప్తియు నగుచున్నది.—

ప్రథ. ఓకీ! మనిసేనస్సీ-

ద్వితీ. మనిసా? యిదేట్రినాగున్నాడు=

తృతీ, (వెళ్లివిశారదుని పట్టుకొని తీసికొనివచ్చును)

విశా. (వణకుచుండును)

ప్రథ. రాయాకునాగెందు కనావొణుకుతావు?

ద్వితీ. అయివోయ్. నువ్వుబూతానివా? పిశాచానివా? మనిసివా? యేటిసెప్పు—

విశా. (వణకుచు నెత్తికొట్టుకొనుచుండును)

తృతీ. ఔబ్బె-బ్బెల్లం కొకొ... కొట్టినరాయినాగ దేటి పల్లకుంతావు?

ద్వితీ. ఓరక్కాదురా-మనరాజుగారికి సూపుదాంరా యీ యీముగ్గాన్ని.

ప్రథ బాగన్నావురా! అనాగేసేద్దాం (విశారదునితీసుకొని పోవుదురు).

[అర్జునుండు ప్రవేశించును]

అర్జు. హా! పూర్ణేందుముఖీ! నీకొఱకిట్టి పాట్లుపడుచున్నాడను. కంటివేహా! కృష్ణా! నాకెట్టులందలజేసెదవో? నీపనుపునగదా యీవేషమువేసి తపసినయితిని-అక్కటా! యీ కృష్ణుడింకరాడుగదా, యేమిసేయుదును. ఆ! అదిగో యెవ్వరో యిటువచ్చుచున్నారు-అయ్యో! విశారదుడును కానరాడు—

[ప్రవేశము బలరామ కృష్ణులు]
దూరమున.

బల. ఛీ! ఛీ! అర్జునుఁడెక్కడ-దుర్యోధనుఁడెక్కడ-

కృష్ణు. ఆఁ! బాగుగనంటివి- అన్నయ్యా! నిశ్చయముగ నర్జునుఁడెక్కడ? దుర్యోధనుఁడెక్కడ?

బల. దుర్యోధనులో సహస్రాంశమైనఁ గాఁజాలఁడు గదా యీయర్జునుఁడు-

కృష్ణు. అవిగో అవిగో తిరుగ దుర్యోధనుఁడే ఘనుఁడనుచున్నాఁడవు. అన్నయ్యా! ఆయర్జునుని గొప్పతన మెంతనియందును-

బల. చాలుచాలు నీవెంత పొగడినను-

చ. నిలువగ నూఱలేదు ధర • జీవయ తెల్లరు నవ్వునట్లుగాఁ
గుడువఁగఁగూడుసున్న. ఘట • కోశములన్న హుళక్కి. గౌరవం
బిల నెటుగన్న బూజ్యము గ • దే! మఱియైక్యము నాస్తి; వారిలోపక్షా.
పలికెను వందిరీతి నతి • భవ్య లటంచు నిదేమి తమ్ముఁడా.

అట్టి పాండవులలో మధ్యముండెట్టు లుత్కృష్టుఁడగును-

కృష్ణు. అగ్రజా! తప్పుఁబలికించితివి? ని వెంచినవియెల్ల ధనానుచరములు. ధనమున్ననో—

ఉ. ఒక్కనిఁ బెద్దసేయు, మఱి • యొక్కని కొలునకిచ్చునాత; యిం
కొక్కనితోడ పల్కు, • మఱియొక్కనికిన్నగు మోముఁజూపు, వే
ఱొక్కనిఁబిల్చు సంజ్ఞల, ను • ఱొక్కనిగూడు, విదుర్చు పైట నిం
కొక్కనిమీఁద, నీ చపల • సాశ్రిత సంపదయంట పాడికో!.

కృష్ణు. పెక్కుసార్లటవీసంచారంబుచేసిన సత్యయుండఁగ సుభద్ర కేమియు భయములేదు-(పరికించి) అదిగో! అట వారిరువురును నేమియో చూచుచు వచ్చుచున్నారు. కాని యగ్రజా, వట్టిసంపదల ప్రస్తుతము పేదపడియున్నను ఆ పాండవులు గుణపరాక్రమసంపదల దుల దూగుచున్నారుగదా-

సీ. పరశుధరుఁ గోదండ • పాండిత్యమును జూపి
యసదృశంబుగఁ గృష్ణ • నందినాఁడు,
అగ్రజుం డొనరించు • యాగంబుకొఱకుఁగా
నవని రాజుల నెల్ల • నడఁచినాఁడు,
ఖాండవం బేర్చఁగఁ • గన్నతండ్రిని నోర్చి
యగ్నిచే గాండీవ • మ్మందినాఁడు,
ముక్కంటి నాదరించి • భుజబలం జేపారఁ
బాశుపతాస్త్రంబుఁ • బడసినాఁడు,
గీ. అతిభయంకర తీక్ష్ణ శ • రాళిజాత
వహ్నికీలాభి ధగాతి • పాలకుండు
క్రూర విరచిత పరిభావ • ఘూర్ణితాత్ముఁ
డర్జునుఁడు విశ్వనృప • తర్జనుండు!

అట్టిపరాక్రమోద్దాముని కీయక దుర్ణయపరుండగు దుర్యోధనునికా చెల్లెలి నిచ్చుట? బాగుబాగు-

బల. ఓయీ పరాక్రమంబులకేమి?

ఉ. దక్షత వాఁడు చేగదను • దాలిచి నిల్చిన యంతమాత్ర ఫా
లాక్షుని శూలము న్గుల న • గాంతకు వజ్రము శౌరిచక్రముం

గాములు సేవకులు; సేవకులకు స్వాతంత్ర్యముండునా?
బలు. రమ్ము రమ్ము తమ్ముఁడా! అదేమి మన భటులు త్రుళ్లుచు నవ్వుచున్నారు-

[ ప్రవేశము విశారదునితో ప్రథముడు ]
(మొదలయిన వారు.)

అందఱు. జోహారు! బలదేవా!! జోహారు!!!
బలు. ఓరీ! భటులారా! యీతఁడెవండు?
కృష్ణు. (నిరీక్షించి చూచి నవ్వుచు) (స్వగతము) విశారదుఁడు—నా కార్యంబున కియ్యది తోడయినది-
ప్రథ. బాబూ మరంతే అదెందోగాని మూగోడ్లాగున్నాడు- ఉలకా ఉలకడు- పలకా పలకడు-
ద్వితి. అదేటి యిచ్చింతరమోగాని, ఒక మాటా నేదు మంతీనేదు- బూతమో దయ్యమో యేల్నో రడగాలి బాబూ-
కృష్ణు. (స్వగతము)తెప్పను-తెప్పను అవమాన మగునేమో- (ప్రకాశముగా) అన్నయ్యా! యీతఁడొక విప్రుఁడుగాఁ దోఁచుచున్నాఁడు. ఓయీ! నీవెవ్వరు?
విశా. నేనొక విప్రుఁడను-
ప్రథ. అన్న బాపనయ్య యెంత గటుకు డొన్స-
ద్వితీ. ఏ మొరగన్నా గొల్లకున్నాడు. అమ్మా బాబూఁ (గుంజెలు కొట్టుకొనును)
కృష్ణు. ఓరీ! మీరిఁకఁ బొండు (భటులు పోవుదురు)-

బలు. అట్లయిన నింతదనుక నీవకాన మేల ధరించితివట-
విశా. నేనొక మహాని శిష్యుండను గాన మహానినై యుంటిని-
కృష్ణు. (మెచ్చుకొనుచు) చబాస్-అట్లుగదా యుండవలయు (ప్రకాశముగా) అన్నయ్యా! శిష్యుని నింత మహానముగ నుంపజాలిన మహాని యెంత మేటియై యుండవలయును. (స్వగతము) యిట్టిమాటలు రెంటితోఁ దప్పక నీతఁడూరికి గొంపోవ నియ్యకొనును.
బల. నిజముగ నంతటి మేటియా యా మునివరుండు?
విశా. అది నన్నడుగుట భావ్యమా?-
కృష్ణు. హాయి హాయి-చూచితివా అన్నయ్యా! యీ శిష్యు నిజూచినంత ఋషి యెంతటివాఁడో కనుగొన నగునుగదా. శిష్యునికే ఆత్మశ్లాఘన మింత కూడదని తెలియునుగదా, యీముని పంచేంద్రియంబుల నెంత వశపఱచుకొనెనో!
బల. కావచ్చును-నీ-
కృష్ణు. (స్వగతము) త్రోవకు వచ్చుచున్నాఁడు. (ప్రకాశముగా) ఏమియోగాని యీమునిసత్తముం జూచినంతవఱకు నామనంబు తత్తరంపడుచున్నది-ఓయీ! బ్రాహ్మణోత్తమా! మీగురుండెక్కడ నున్నాఁడు?
విశా. ఈ చేరువనే యుండును-
కృష్ణు. అన్నయ్యా! పోయి చూచి మంచి దారింగనుగొందము-రమ్ము
బల. నాకును తొందరగనే యున్నది-రమ్ము (అని నడచుచుం

డును)

కృష్ణు. ఇంతవరకు నాప్రయత్నము సఫలమే. ఇంక నూరికే దీసికొనిపోవు నుపాయమున్నది. సత్యభామయు నిట్టులే సుభద్ర మనంబున, ననురాగము పురికొల్పుచునే యుండును- (పోవును)

[ ప్రవేశము అర్జునుఁడు సుభద్ర సత్య. ]

అర్జు. ఈఫలహారంబుల నాకలితీరెను గాని యాసుందరాఁగి నాచకోరనయనంగాంచు నంతదనుక తాపంబెట్లాగును? అక్కటా! కృష్ణుండు బలునితేఁజాల కుండెనా? ఆఁ! ఏమి? జగన్నాటక సూత్రధారియగు శ్రీకృష్ణునకు నిట్టిపని యసాధ్యమా- పరితప్తహృదయుండ నగుట నాకు నిముషంబు లబ్దంబులగతి దోచుచున్నవి. (నలుదెసలఁజూచి) ఆహా! ఎవ్వరో యిరువురు వచ్చుచున్నారు-ఏమివారియందము! హా యి రేహృదయమా! కృతార్థత జెందితివి. అందా యువతి నాసోదరియగుసత్య. కాననాపూర్ణేందు బింబానన నామనోరథాస్థాన సీమయేయగును. ఆహా! చేరవచ్చుచున్నారు. ఆహా! ఏమియందము!

ఉ. హాయిరె సోయగంబు గన ♦ బ్రాణముబోసిన చిత్రరూపమో!
గాయక విద్యనేరిచి జ ♦ గన్నలికెక్కిన రత్నవల్లియో!
పాయము, మందయానమును ♦ బాగుగ గల్గు మెఱుంగుదీగయో!
నాయెదఁ దాపమార్ప భువ ♦ నంబు నవుం దిగు చంద్రరేఖయో!

సీ. మోము గాదిది చాల రంగ • మౌను గాని,
మోవి గాదిది కప్పురంపు • దీవి గాని,
యింతి గాదిది రతిచేతి • బంతి గాని,
కాంత గాదిది లోకపు • వింత గాని.

భళిరే రాజబింబాననా! నీకొఱకిట్టి కష్టములు పడుట యొకయబ్బురమా? నీసోయగంబు నెన్న నాతరమా?

ఉ. కన్నులు పట్టినాము విరి • గల్వలఁ, దామర తూఁడ్లవంకలం
దిన్నఁగఁ జేయు చేతు, లలఁ • తిన్ముఖ మబ్బము నవ్వు, గుబ్బలా
రెన్నఁడు నెయ్యని స్వాకుప • నీయవు జక్కవ, నేమి సెప్పనే
కన్నియ నందపున్నరసి • గా దన నోరెటులాడు నేఁటికిన్!

ఇట్టి లావణ్యాంబురాశి నోలలాడుట యెన్నఁడో దైవమా! దగ్గరగవచ్చుచున్నారు. నేనింకఁ దపంబు సేయవలయును. (కూరుచుండును.)

[దూరమున బ్రవేశము సుభద్ర–సత్యభామ]

సుభ. వదినే! సత్యా!

ఉ. మూలికలౌను భోజనము, • పూవుల సెజ్జగు శాద్వలంబు, రా
జాలె యరంగులౌను దను • రంజితపానము నిర్ఝరాంబువుల్
చాలగ గల్గునేణములె • సత్సఖి బృందము, సౌధము ల్గుహల్
మేలగు నిట్టికాననము • లెస్సన రేమొకొ భూజనావళుల్!

సత్యా! ఎంతరమణీయముగానున్నదే యీవనప్రదేశము—

సత్య. (తలయాడించుచు) అట్లయిన నీకోర్కె మీయన్నగారి తోఁ జెప్పి నన్నువనంబున నుంచు నేర్పాటుగావింతును లే (స్వగతము) ఉద్యానవనమున అదిగో తమ్ముఁడు చేపలకొఱకు వేచియుండు బకంబువలె ధ్యానము చేయుచున్నాఁడు. ఇటుద్రిప్పవలయునుగదా యీరథమును-(ప్రకాశముగా) సుభద్రా! యేలనే యట్టు లూరకున్నదానవు?

సుభ. కాదుసత్యా! నేనన్నమాటలకెల్ల నిట్లనెబదులుచెప్పుచున్నదాన వది యేమియో నీకు క్రొత్తబుద్ధి వొడమినది-

సత్య. నాదియా క్రొత్తబుద్ధి? ఆసూర్యంపశ్యవై యింట మెలంగు దానవుగదా:— యీకఠోర కాననంబుఁ జూడ మనంబగుట క్రొత్తకాక ప్రాఁతదియా? చాలు చాలు! నీ విషయమే నీ వెఱుంగక నను నాడెదవు? రమ్ము మనకొఱకు మీయన్నలు వేచియుందురేమో-

సుభ. అట్లనేపోదము (తెలఁగిజూచి యర్జునుగాంచి) సత్యా! సత్యా! చూచితివా యీవింత?

సత్య. నీకిచ్చట నున్నదంతయు వింతగానే యున్నది-యేమి యా ఆవింత; చెట్టున కాకు లున్నవి కాఁబోలును!

సుభ. కాదమ్మా: రావే చూచెదవుగాని;—ఆసుందరాంగుఁ డెవ్వఁడో చూచితివా?

సత్య. ఆహా! సుభద్రా! యీతఁ డర్జును వెన్నుదన్నిన యట్లున్నవాఁడు. ఆయర్జును జూడలేదనియెదవు? చూడు మీతఁడే యర్జునుఁడు; అర్జునుఁడే యీతఁడు-

సుభ. ఉ. ఆంతపిశాలవక్షమును, ◆ నంతటి కీపులసొంపు పెంపు, మో
మంతయు నిండు కన్నుగవ, ◆ యట్టి చొకాకపు మోవి తేవి, యా
వంతయు గద్రె చూదిక? జ ◆ యంతునియందును జంద్రునందునన్
గంతునియందు నైన మఱి ◆ కాంతి, వసంతుని యందు నైనన్!

ఆహా! యేమియందము!! సత్యా! యీ యందము జూచినవారిదిగదా భాగ్యము!—

క. ఏపుణ్యవతికి బుట్టెనొ?
యేపుణ్యములను దాని ◆ యింపున బెండ్లిన్
జేపట్టెనొ? యీసుందరు
జూపరె! వేనోళ్ల బలుక ◆ వశమే పొగడన్!

నిక్కముగ నింత యందగాడటే యీ యర్జునుండు?

సత్య. అమ్మో! పెద్దీ! ఆయర్జును నింత బాగుగ నెఱింగి మేమునయితము నేని నటు నిలువఁబెట్టిన నం దెవ్వఁ డను సందియంబున మునుంగుదుము. అందున నేగదా వాని నిం దఱు జెలతై గోరుట:—

సుభ. ఓ సత్యా! జెలతై యనెదవేమి? బుద్ధిశాలులై యనుము.

సత్య. ఏమీ! రూపంబునకు వలచిన వారలు బుద్ధిశాలురా? నేనాజెలను?

సుభ. అటుగాదు—వదినే, చూడుము.

సీ. మోవిదొంటను గూర్చి ◆ పోవ నుంకించని
చిలుకలకొలి కోర్తు ◆ గలదె ధరను?

బాహులబి సార్ధమై ♦ పర్యన రాఘండు
హంసగామిని యెందు ♦ నలరు నిలను?
మోముదామర జూచి ♦ మున్నటు జేరని
యలివేణి యెచ్చట ♦ నలరు నవని?
హాసచంద్రికఁ జూచి ♦ యాసనురాని చ
కోరాక్షి యెచట చే ♦ కూరుఁ బుడమి?

గీ. రమణ మునిచంద్రు జూచిన ♦ రాత్రులందు
పద్మముఖి యోర్తు తమిఁ జెంది ♦ పాటుపడక
యలరు పెల్లను గల్లదా ♦ యమ్మచెల్లి!
పలితి యగు గాదె యీతఁ డే ♦ పగదినైన!

నిక్కముగ నిట్టి రాసుతుఁ డుండిన వానియం దనురాగముండని చెనటి యుండునా?

సత్య. (స్వగతము) ఆఁ! దారికి వచ్చుచున్నది—(ప్రకాశముగా) చెలీ! సుభద్రా! అదియేలనే అట్లనుచున్నావు? త్రోలుతనే యౌవనంబు నతిరమ్యంబనికొనియాడుచున్న నీకీ తలఁపేల కల్పటైనో కదా—నాకు భయం బగుచున్నది. ఇంక నీమాటలఁ జాలింపుము—నెట్టనఁ జుట్టున జడలును జూచి మీసలును గల్గిన యీ విరాగిని వర్ణించుచున్నావు?

సుభ. సత్యా? నీతో నిజంబు దెల్పెదను వినుము—

సత్య. అట్లు నిజంబు దెల్ప విందును గాని నీ యతీశ యోక్తులు నాతరమా వినుట?

సత్య. సుభద్రా! ఇంక నిచ్చటనుండఁదగవు. రమ్ము (అని లాగికొనిపోవుచు)

సుభ. (పోవుచు) అక్కటా!

ఉ. ఆపటమైన నేను కను ◆ లారఁగఁ జూడఁగ నోచనైతి నా
గాదిలినైన సత్యయది ◆ కానిది గానుతి చింత సేయుఁ జా
ఖేదము మానసంబునను ◆ కీడ్వడ లాఁగఁగ నేమి సేయనా
నాదని త్రన్నుఁ జూచుకొని ◆ యాపయి లాఁతినిఁ జూచెఁ గావలెన్.

[పోవుదురు]

అర్జు. హాయిరే సోయగంబు:—

ఉ. తమ్ములు కన్ను, లంచకుహి ◆ తమ్ములు చేతులు, మేలిపూవుమొ
త్తమ్ములు గుబ్బ, లార్యవిది ◆ తమ్ములు కాగ్యముల్, అంగజాస్త్రస
తమ్ములు మాపు, లంచకహి ◆ తమ్ములు యానము లింపుమీనదం
తమ్ములు, పల్కులెన్న నమృ ◆ తమ్ములు; సామ్ములు సమ్మకోమ్మకున్
అహో! యీ మెంత నన్నంగీకరించిన—ఆఁ! యెవ్వరో వచ్చుచున్నారు. (చూచి) మఱియెవరు? బలునితోఁగూడఁ గృష్ణుఁడు వచ్చుచున్నాఁడు. ఇప్పుడు గదా కృతార్థుఁడనైతిని—

[ప్రవేశము, కృష్ణ, బల, విశారదులు.]

విశా. అదిగో వారే మహానీశ్వరులు.

కృష్ణు. అన్నయ్యా! తాళుము తాళుము—చూచితివా ఆ తేజ

న్ని! ముఖంబు జూచి నంతనే నామనంబు వేఱువిధంబుగ నున్నది. ఆహా! మహాను లన్న పేరు గదా మహానులు. ఇట్టి వారి దర్శనంబుకొఱ కెంతతపంబొనర్చి నారమో కదా! ఓహో! యెవరురాయచ్చట? పోయి సుభద్రను సత్యను నిట కుఁ దోడ్తెమ్ము—అన్నయ్యా! మనజన్మంబులు కృతార్థతఁ జెందినవి—మహీశ్వరా!

ఉ. మానికులావతంస, జన ♦ మాన్యచరిత్ర! భవాభిధేయపా
థోనిధి నీపదాబ్జముల ♦ తోఁ జెడి నామదిఁ దాసఁజేసి నే
మానక నెప్పుడున్ భవ ♦ దంఘ్రిసరోజం బను నోడగానకన్
గానవె సంకటస్థుఁడను, ♦ కాం దనఁ బోవము నీకు మ్రొక్కెదన్.

బల. ఆహా! మేటులకు మేటియగు నీకృష్ణుం డీతని నిరాఘాటంబుగ భక్తి మ్రొక్కుచున్నాడు—ఈతఁ డెంతయో ఘనుఁడయి యుండును— కాకున్న నీతఁ డిట్లు లేలఁ జేయును? నేను నట్లుసేయుట కర్తవ్యము. పంచేంద్రియంబులను చతుర్వర్గంబుల వర్గంబుల బిగ్గఁ బట్టి వశీకరించుకొనిన మహామహా! వందనములు.

అర్జు. శిష్యా! వీరిని తెమ్మనుము.

విశా. (అందఱిని లేపుచు)

సుభ. }
సత్య. } మానికులావతంస! వందనములు

అర్జు. రామా!

బల. అదేమితమ్ముడా! అందరు మానులును కృష్ణా యనుచుండ నీతఁడేమి రామా యనుచున్నాఁడు?

కృష్ణు. (స్వగతము) అన్నా? తెచ్చిపెట్టినేచక్క (ప్రకాశ
ముగా) ఆఁ! తెలిసినది. అన్నయ్యా! ఈతఁడు గతయుగం
పు ఋషిగాఁదోచెడిని గానసీతఁ డిట్లు రామనామ స్మరణం
బు జేయుచున్నాఁడు. కావుననే యింత తేజోనిధియై కన్ప
ట్టుచున్నాఁడు. కాకున్న నింత శాంతమూర్తి కలఁడా? మహా
నికులావతంసా! కృష్ణుఁడిదె మ్రొక్కుచున్నాఁడు.

అర్జు. నీకు శుభమగుఁగాక!

బల. యతీశ్వరా! వీఁడెబలరాముఁడు; నతులొనర్చు చున్న
వాఁడు—

అర్జు. ఇష్టాప్తి యగుఁగాఁత!

బలు. (స్వగతముగా) ఇష్టాప్తియా? దుర్యోధనుండు మనంది
యగుటయేనా యిష్టము. ఋషి నామనమునకు వచ్చెను.

సుభ. మునిజనపాలా! ఇదే సుభద్ర ప్రణతు లొనర్చు
చున్నది.

అర్జు. రామా!—శీఘ్రుంబె పెండ్లియగుఁగాక.

సత్య. తపసివరా! సత్యభామా నమస్కృతు లందుఁడు.

అర్జు జననుతవయ్యోదవుగాక! మీరలెల్లరు మే ముండుకాన
నంబు లెట్టివియో చూచుటకా వచ్చినారలు?

సుభ.
సత్య. చిత్తముస్వామీ!

అర్జు. రామ! రామా!

కృష్ణు. ఆహా! అన్నయ్యా! సుభద్రా! సత్యా! చూచితిరా
యీయన పల్కులయాదరణంబు? మన మిట్టివారి నెంతై

న గంటివే? అన్నయ్యా! యీమునికులతిలకుని మనయూ
ర కొంతకాలంబుండనిచ్చిన మనకెంతయు శ్రేయస్కరం
బని తోచుచున్నది. నీ వే మనియెదవు సత్యా?

సత్య. అట్టిట్టి మునినాయధేయుల కెల్ల కాణాచిమైయున్న
మన ద్వారక క్షేత్రము రాకుండిన సిగ్గుగాదే?

బల. (కృష్ణుని చెవులో చెప్పును)

కృష్ణ. (స్వగతము) ఆఁ! దారికిదిగుచున్నాడు. (ప్రకాశము)
సత్యా! సుభద్ర కా కానసశృంగారము చూపుచుండుము.

సుభ. అన్నయ్యా! సత్య చూడు మెట్లు నన్నెగతాళి చేయు
చున్నదో! నేనుపోను.

సత్య. (అపవారించి సుభద్రతో) ఈలాగున నైన నీతనిఁజూ
చుచుండుట కా? రమ్ము.

సుభ. చెలీ! వత్తునుగాని వింటివా పలుకులు.

ఉ. పల్కులు తేనెలొల్క నతి • వా! కడుముద్దులు గుల్క కప్రపుం
బల్కుల మేటిచిల్కనుడు • పాలుని వెన్నెల తళ్కులొల్క నా
చిల్కల దిద్దిపల్క మను•శీకరజాలము వెల్కి సొల్క నా
తొల్కరిగుల్క పుల్కలొక • తూరిగ నుల్కఁగఁగుల్కఁ గల్కిరో.

ఆహా! యెంతమార్దవముగ నున్నవి పలుకులు. అర్జునుని
పలుకులిట్లుండునా?

సత్య. నీకేమి వెఱ్ఱి పట్టినదా యేమి రమ్ము (అనితీసికొని
పోవును)

బలు. తమ్ముఁడా! ఈ మునిని మన యూరి యుద్యానంబున
కుఁ దీసికొనిపోదము.

కృష్ణు. తప్పకతీసికొని పోవలయును, లేకున్న సత్య యనినటు
లు అది నగుబాటగును.

బలు. అటులుంచి శుశ్రూష జేయ, మనసుభద్రను—

కృష్ణు. (వినుమఁ దలయూఁచుచు) చాలుచాలు నిదియా
యాలోచన? బాగుగ నంటివి? మఱల లెన్నగ యో
చింపుము.

బలు. అదికాదు కృష్ణా!

గీ. ఇట్టిముని సేవఁ జేసిన • యట్టులైన
మన సహోదరి కాఁగాదె • మంచివరుఁడు
కల్గు భాగ్యంబు దీనిని • గాంచకుండ
నద్దు వద్దన నిది యేమి • పాడి కృష్ణ?

కృష్ణు. (ఆలోచించుచుండును)-

అర్జు. ఆహా! యేమి యీ యాకారము. ఎంతసి చూచు
వాఁడ-

బలు. తమ్ముఁడా! యేలనంత దీర్ఘాలోచనలో మునింగియు
న్న వాఁడవు? నే నను నది సరికాదా?

కృష్ణు. ఇదియే సరియైన నింక సరికానిదేది?

గీ. మానవులలోన రూపసి • మానిఁజూడ,
సుందరులలోన సుందరి • సుదతి యౌర!
యెట్లు బాగుగఁ దోచును • యీ కుబుద్ధి
నేఁడు నీ కేలకల్గెనో • నే నెఱుంగ.

బల. చాలుఁ జాలు కృష్ణా! నీకు మతిపోయినది. అసదృశం

డగు నీమునిని సామాన్యులతో సరిపోల్చెద విది యేమినీ తి? చాలు నూరకుండుము.

కృష్ణు. అసదృశుండగుట నిజమేగాని-

శా. నిద్రాహారము లింక రాజ్యసుఖముల్ ♦ నిందించి తా నంతయే
భద్రంబౌ వటవీప్రదేశములలో ♦ పద్నాల్గు వే లేడుల
త్యుగ్రంబౌ తప మాచరించి ఫలమా ♦ శూన్యంబుగా మేనకా
భద్రేభాంచితయానఁ గూడికొనఁడే ♦ ప్రాజ్ఞుండు గాధేయుఁడున్!

అట్టివారల మన మెఱుంగమా? కాన వద్దు-అన్నయ్యా! వద్దుసుమా!

బల. నేఁదప్పక తీసికొనియెదను. నీవెన్ని చెప్పిన న్వినను-

కృష్ణు. అన్నయ్యా! వలదుసుమా-దానివలన ముప్పు గల్గును-మానుము-అయ్యో! నీ కీ వెఱ్ఱియూహ యెందుసకు పుట్టెను? దైవమా! యేమిచేయనున్నావో?

బల. చాలు చాలు కృష్ణా! నీ యూహయంతయు నాకుం దెలియకయున్న దని కాఁబోలును. ఈ మునిసత్తముఁ బూజించినఁ దత్కారుణ్య నెక్కడ దుర్యోధనుండు ప్రాప్తించునో యని యర్జునపక్షపాతివై యిది వల దని చెప్పుచున్నాఁడవు? ఇంకఁ జాలింపుము-

కృష్ణు. అట్లయిన నాతని కిచ్చియే పెండ్లిసేయుము. (అర్జునుని జూపుచు) ఇదిగో అర్జును నింక విడుచుచున్నాను నేఁ బోయెదను (స్వగతము) ఇంకను నగమున్నది- (నిష్క్రమించును)

బల. హూనికులావతంసా! మీరు మావీటఁ గొన్ని దినంబు లుండి మమ్ము పావనము సేయవలయును—

అర్జు. నీవు కోరుచున్నాఁడవుగాన నట్లులనే సేసెదను-

బలు. (స్వగతము) ఆహా! యెంత గూఢాదరము నామాటల యందు! నిక్కముగ నీతఁడీశ్వరుని యవతారంబగునా?

[యవనికపడును]



# చతుర్థాంకము.

## ద్వారకానగరము.

[ ప్రవేశము:—అర్జున విశారదులు ]

విశా. అర్జునా! ఇంక నీ జపంబు చాలించి ఆతటాకంబుదరికి రమ్ము.

అర్జు. తటాకంబుదరి కేల?

విశా. సుభద్రపై నాస కొక ధార విడుచుటకు—

అర్జు. విశారదా: ఏల న న్నట్లు హేళనఁ జేసెదవు? సుభద్ర దొరకకున్న ధార విడుచుటతో సరియా—

విశా. ఆఁ! ఆఁ! ఆమాట మాత్ర మనకు. తిల లిచట ముష్టి యెత్త వలసియుండును—

అర్జు. తిలలు కాదు—ప్రాణంబులే విడువవలయును సుమా?

విశా. ఆహా! ధైర్యము—నీ పటాటోప మంతయు నింతే—

అర్జు. అదికాదు విశారదా! మన్మథాగ్నికీలల నీ వెఱుంగవు.

విశా. ఎరుగకుంటయేకాక అట్టింట కానందంబు నందుచున్నాడను.

అర్జు. కావున—ఇట్టిస్థలములధైర్యమనుచున్నాఁడవు. స్మరాగ్నిజ్వాలలకుం దాళ నాయీశ్వరునికైన శక్యంబు గా

కుండె. అట్టి బెట్టిదంపు తాపమయినను నాధైర్యము మొక్కవోయె నా? చూడుము.

కం. అళులకు జడియను, చూడుము
మలయజపవనంబు వీవ • మా ర్గముగాక
కలకంఠుల రొద వినియెద
నిలువనటే వెన్నెలందు • నిర్భయముగ నే!

విశా. ఓహో సాహసకృత్యంబులు! తుమ్మెదరొదలు శాత్రవభేరీరవంబులా? కోకిలలు సేనయా? కలకంఠులరొదలు సింహనాదంబులా? వెన్నెలయా నీకు యుద్ధసాధ్యశ్యంబు? ఆహాహా! మానివేషంబుతో ప్రపంచకజ్ఞానముగూడ మరువఁ గల్గితివా?

అర్జు. ప్రపంచకజ్ఞాన మేల మరతును?

విశా. ఆకారణమ్ము తెలిసిన నీ మాట లందునా? యేమి నీవు వక్కాణించిన సాహసకృత్యంబులు చిన్నచిఱుతలు సేయరా? నేను జేయుచున్నాఁడను కానా? ఇంక నేనును దిగ్విజయంబుఁ జేసినవానితో సమానుండనే?

అర్జు. విశారదా! నీకేజ్ఞానము లేదు.

విశా. ఇదియే జ్ఞాన మైన యెడల నా జ్ఞానంబునకు పదివేల నమస్కారములు. నా కా జ్ఞాన మక్కఱ లేదు. ఇంకమధ్యాహ్న మాయెను. నేనుబోదునా?

అర్జు. అక్కటా! మధ్యాహ్నమా?

గీ. భాను డదె వెల్గు మధ్య న ♦ భంబు నందు.
వేళమించెను రాలేదు ♦ వెలఁదిమిన్న.
కోటులఁ గడపఁగ జాలుదు ♦ నీక్షణంబు
యువతి లేకున్న క్షణ మొక ♦ యుగము గాదె.

విశా. యేమేమి? యువతి లేకున్న క్షణ మొక యుగమా? అట్లయిన నావంటి బ్రహ్మచారు లెల్ల బ్రహ్మతో సమాను లేగదా!

అర్జు. అదియేమి? నేనన్న దియేమి? నీయర్థమేమి?

విశా. కాదు కాదు. నా కువిద లేదుగదా—ఇంక నా ఇప్పటి వయసులో నెన్ని క్షణంబు లుండునో అన్ని యుగములు గదా నీ సూత్రప్రకారము—కాన బ్రహ్మతో సమానుఁడ ననియే యనుకొనుచున్నాఁడను—

అర్జు. అక్కటా! విశారదా! నీ వన్నియు వేళగతి నట్లాడెదవేమి? దినదినంబును శుశ్రూష నామంబునం బరగు మహాభిషేకం బొనర్చుచున్న యింతి రాకున్న నే నెట్లోర్తును? ఆయ్యో! సుభద్రా!

గీ. రాజ్యమును వీడి, మిక్కిలి ♦ పూజ్యులైన
యన్నదమ్ముల విడనాడి, ♦ యవనిఁ దిరుగ
వచ్చి, మునివేష మందితి ♦ భారమందు,
[illegible] చేకొ[illegible]ను, నను కోర్కె ♦ మిన్నుదాక.

విశా. [illegible] యీగోప్రదక్షిణ? అట్లయిన [illegible]
బున [illegible]

అర్జు. (వినకయే) అక్కటా! సుభద్రా! నన్ను సాధారణ మునిగా నెంచి నీ విట్లు జేసిన నే నెట్లుందును? నీవు దూరంబున నుండఁ బ్రాణంబులు మాత్రము చెంత నుండు ననుకొంటివా?

విశా. ఆఁ! అర్జునా! ఇంక చాలింపు మీ విచారంబు ఒక్క క్షణంబులో నీ వంత మాన్పగలను. ఛీ! మఱి విచార మెందులకు మానుము-

అర్జు. వయస్యా! విశారదా! యెట్లుమాన్పగలవు? వేగము తెల్పుము. నీ కెన్నియో వందనంబు లిడెదను-

విశా. ఇది యొక ఘనకార్యమా! ఒక జాంఘికునిఁ బిలిచి యీ ఋషి సాధారణంపు ఋషి కాఁడని యూరంతయుఁ జాటింపించెదను-అంత సుభద్ర కా సంగతి తెలిసి నిన్ను పెండ్లియాడును-

అర్జు. సరిసరి-ఇదియా నీయూహ? పుట్టెడాసతో వినుచుంటి నిగదా-అక్కటా! సుభద్రా!

గీ. అతివ! నీకన్నుకెడిస • లావజేషి
వేయు వేసంబె యాఁ గాని • వేఱు గాదు
చేషిసది తపమును దాను • వేసినట్టి
దరయ గాలంబునా నుడి • యన్వృతమా నే!

నాయూహఁ దెల్పిన నీ విట్లు సేయకుందు వేమో?

విశా. ఆఁ! బాగుగఁ జెప్పితివి? అడుగక యమ్మ యైనఁ బెట్టద న్న నిట్టి యింతుల వేఱ చెప్ప నేల? కాన నట్లడుగుటయే

యుచితము. ఆహార వ్యవహారము లందు మోమోటమి యుండఁ గూడదు—

అర్జు. అటుకాదు విశారదా!

గీ. "నేనె యర్జునుఁ" డన ♦ చాన నమ్మకపోవుఁ
దానె కోరి నన్నుఁ ♦ దలఁప దటుల
ఎట్లు తెలియఁజేయు? ♦ నేమని చెప్పంగ?
నెవరిఁ బట్టుకొందు ♦ నెఱుక సేయ?

విశా. ఎవరిని బట్టుకొనిన నెవ్వ రేమిచేసెదరు? ఆకాంతనే పట్టుకొనవలయును.

అర్జు. అదియెట్లు?

విశా. ఎట్టులా? ఇప్పుడు సుభద్ర వచ్చినప్పు డా చేయి నట్టె పట్టుకొని సుభద్రా "నేనె యర్జునుఁడ" నని చెప్పుము—

అర్జు. అబ్బబ్బా—

గీ. అట్లు నేను జేయ ♦ నతివ భీతిని బొంది
యిట్టులున్న దాని ♦ నెఱింగి పరులు
నగరె? యానరుండు ♦ తగవుమాలె నటంచు
కానఁ గూడ దటుల ♦ కాంతఁ బట్ట.

విశా. (స్వగతము) అట్లయిన నీగ్రహచారంబునకు నేనేమి సేయువాఁడ? (ప్రకాశము) అర్జునా! యింక నీవే యాలోచించుచుకొనుము. నేఁబోయెద (పోవును)

అర్జు. హా! సుభద్రా! నవమన్మథసాయకమా! నీ కొఱ కిట్లు దూపుమాలియున్న నాపైఁ గరుణింపరాదా? ఖిూ యన్న

బలరాముఁడు మన వివాహంబునకుఁ బ్రతీకార మొనర్చు గదా యను చింత నీపై చూడ్కులతోఁ ద్రోసివేయుచు న్నాఁడను–అట్టినన్ను–

గీ. కొమ్మ, నీవు చెంతఁ ♦ గూర్చుండ రాదటే
"కోటినదుల మున్గ ♦ మేటి ఫల" మ
టంచు పలుకు నన్ను ♦ నయ్యయో! విడనాడి
దూరముంట తగవె? ♦ తోయజాక్షి!

హా! మారునిదంతీ! నయఁజూపవే–ఆహా! యేమి యీ పరిమళము–

గీ. అన్ని పూల తావు ♦ లణఁగఁ ద్రొక్కఁగఁజాలు
నహహా! డెంద మందు ♦ హాయి దనరె

(చేతితావళంబు వైచి)

చేతితావళంబు ♦ చేఁజారి పడఁజాలు
మఱపుగల్గె దేహ ♦ మెఱుఁగ నేను.

ఇది యేమయి యుండును?

గీ. అకట! యిటుల నన్ను ♦ హర్షాబ్ధిలో ముంచి
దేహ మెఱుఁగ నీక ♦ తేల్చి నట్టి
దేమి యగును పుడమి ♦ నెలనాగ మైతావి
గాక; కానవచ్చు ♦ కాంత యిపుడు!

ఆహా! కృతార్థుండ నైతిని–ఇంక నేను–

సీ. శిరము వాల్చవలెను ♦ గరమున జపమాల
త్రిప్పుచుండవలెను ♦ వెరవ రొద్ది
యనిశ 'రామ' యనుచు ♦ ననవలె సమయముఁ
జూచి వెలఁది రూపు ♦ చూడవలయు.

(అని యట్లుచేయును)

[ ప్రవేశము:— సుభద్ర ]

సుభ. (స్వగతము) మహానుభావులగు నీ మహాత్ములకు నా
పై కినుక జనించి యుండునా? ఆలస్యముగ వచ్చినంత
మాత్రమున కోపమేల వచ్చును? అంతర్జని తాగ్రహానిగ్ర
హులగు నిష్ఠితులకు నాగ్రహ మేల గల్గును? కాదు-కిను
కయుండదు-అదిగో వీర లింకను తపముద్రనుండి మేల్కొ
ననేలేదు-(అర్జునుజూచి) ఛీ- వెఱ్ఱిహృదయమా! ఎన్నిసార్లు
చెప్పినను మహామహుండగు నీతని నర్జునుఁడని యెంచెద
వేమి? మానిసిబోలు మానిసు లుండరా? అయినను నేను
వార్తాముఖంబున విన్నది యంతయు నీమహాత్ముని యందు
గాన నగుచున్నది.

ఉ. ఆ నగుమోమునేయగము, ♦ నా విపులంబగు సింహవక్షమున్
ఆ నతశృంగనాసికయు, ♦ నా రమణీయనిటాలసీమయున్
ఆ నళినంబు వీరు కను, ♦ లా మధుసీధువులూరుమోవి, య
వ్వాని వెయుంచు వింటిఁగద ♦ హా! విధి! చిత్రము నీదు చైదముల్!

ఆహా! యేమిది! సత్యయు నీతఁ డర్జునునివలె నున్న వా

డని చెప్పినది. అంతియ కాక, యీతండే యర్జునుఁడంట, అక్కటా! అజుఁడగు బ్రహ్మ అర్జునునట్టి సుందరాకారుల సృజింపఁగల్గియుండునా? కల్ల - యీతఁడే అర్జునుఁడయి యుండవలయు-లేక చిద్విలాసంబు కొరకు కర్జునుం డీవేషం బు నంది యుండ వలయును. కాదు-కాదు-సుధీధురంధ రుండగు నా ధనంజయుండేల యిట్టు లెండవానల కోర్చి మునియై యుండును-ఉండునుబో, మాద్వారక కేల వచ్చు ను? కాన నీతఁడొక్క ఋషియే- వేఱు కాదు, ఋషియే యైన మునివృత్తితో నెన్నఁడు కూడియుండని నీ సుకుమా ర శరీర మీాయన కెట్లు లభించును? అర్జునుఁడే యగు నే మో? ఆసాగను మీాసము పెఱిగియు రాజచిహ్నమును వీ డినట్లు కానుపింపదు? ఈమహానుభావుని చూ వన్ననో తా నె సర్వలోకంబులఁ గెల్తు నను కీర్తిం బొందియున్నది- ఇంతకు నెవ్వని నైన తన సవ్యకరంబుననే బాగుగఁ జే యును. ఆఁ! మరచితిని-ఎంత కట్టఁబడినను శిరోజములు గుడా కేశునిఁ బట్టి యిచ్చుచున్నవి. ఎటులయిననేమి? ఈతఁ డర్జునుండని నే నెట్టులందును? మహానుభావుల చరితంబు లత్యద్భుతములుగదా- లేకున్నను, ఒకరిని బోలిన వా రిం కొక రుండరా? కాన నో వెఱ్ఱిహృదయమా!

1. ఏల యీారక కేశవు • గోలవగుచు?
నీతఁ డర్జునుఁ డని నను • నెక్కసక్క-
మాడుచుందువు మానవే • యాతలంపు
మానిసినిఁబోలుమానిసి • కానరాఁడె!



(దగ్గరకుఁబోయి) మహానుభావా!

అర్జు. రామా! (అని కనులువిచ్చి) ఎవరు నీవు? సుభద్రా! నే డేల యింత తడసితివి?

సుభ. ఇంచుక జాగాయెను- క్షమింప వలయును. నేఁడు మా సోదరు లిందుధరోత్సవంబునకుఁ బోవుచున్నవారగుటఁ గొంత తడయ నలసివచ్చెను-

అర్జు. రామా! కాంతామణీ! మాబోటివారిని మఱచి నీవు జాగుచేసినఁ జెప్పునదేమి కలదు?

సుభ. మహామునీంద్రా! అనుజ్ఞయొసఁగుఁడు. నే నేమి చేయవలయు?

అర్జు. (స్వగతము)

చ. శ్రవణముతృప్తిఁ జెందు నది ♦ సాజము; చక్కని పల్కు విన్నచో
భువన విచిత్ర మిద్దిగన ♦ మూఁడును రెండగు నింద్రియంబులున్
వివశత జెంది హాళిగొనె ♦ భేద మొకింతయు లేక వింటచే
యువకలకంఠి హృద్యమగు ♦ నూర్జిత కాకలికాస్వనం బొగిన్.

(ప్రకాశముగా) సుభద్రా! లతకూనపూవులును, బాగైన కొమ్మఫలంబులు నుదెమ్ము-

సుభ. చిత్తము - (స్వగతము) అక్కటా! నామతిభ్రాంతి యింకను నన్ను విడువకున్నది. లతకూనపూవులు దెమ్మన, లతకూనా యని నన్నుసంబోధించె నట. పువ్వుల దెమ్మని యాజ్ఞ యట-

గీ. హృదయమా, లోకమున లేని ♦ వెల్ల నేల
కల్పనలఁజేసి నీలోనఁ ♦ గనెదు ముదము?
కాదు కా దన్న నక్కటా! ♦ కరుణమాలి
యీతఁడే యరునుం డన ♦ నేల చెపుమ?

యింక నీ త్రుళ్ళు మానుము—

గీ. ప్రాణ మిచట నుండఁ ♦ బలుకులు వేయన్న
వెడలిరాదు నన్ను ♦ విడిచె నకట!
కాన నీవు నైన ♦ కట్టుపిదేహామా!
రమ్మ, పూలఁజేర, ♦ రయము మీర.

(పూలఁదెబోవును)

అర్జు. (మెల్లమెల్లఁ గనులు విచ్చిచూచి) అక్కటా! సుభద్రా! దూరముగ బోయితివా?

గీ. దేహ మిటనె యుంచి ♦ తెరవ, నాప్రాణంబు
తోడఁ దీసికొనియె ♦ దూరమునను
వెలఁది, యకట! నన్ను ♦ వేఱుచేసె కడంక
యెట్టులోర్తునో క్కా? ♦ యేదిదిక్కా?

(అని యటుజూచి)
అదిగో వెలఁది ఫలమును దీయుచున్నది—

గీ. వృక్షశాఖను దనశిర ♦ మొత్తి జూచి
కొమ్మ్ఁ రాజిలు ఫలమును ♦ గోయఁ దనదు

చేయి సాపఁజక్కని చేల ♦ చెఱఁ గొకింత
జారి యూరించు గుండెలు ♦ ఝల్లు మనఁగ.

గీ. చెట్టుకొమ్మ తనదు ♦ చేతి కందక యుండ
పొంతరాతిమీద ♦ పొలఁతి యెక్కి
పాద మింత యెత్తి ♦ పయ్యెదసవరించి
చేయిసాచి యదిగొ ♦ దీయుఫలము!

ఆహా! యీసుందరాంగి చూచిచూచి చేయిసాప కూర కుంట యెట్టులో గదా దైవమా! అదిగో నాప్రాణా ధారము–

గీ. అదిగొ చెంతనుగల పూవు ♦ పొదలఁజేరి,
క్రూర మని యేమొ యించుక ♦ కొంకి నిలిచి,
దేహ మించుక వంచియుఁ ♦ దీయు పూల
జూచు చున్నది తనమది ♦ చొప్పుఁ దెలియ.

ఆహా! అవలిముఖమైయుండ నా వెలఁది క్రొవ్వెద నే నెంతని వర్ణింతును–

ఉ. అంగనమోముచంద్రుఁగని ♦ యార్తిని జీకటిగుంపులెల్లఁ ద
న్వంగికి ముందురాక భయ ♦ మందుచు వెన్కకు జొచ్చి తమ్ము కా
వంగను మొఱ్ఱవెట్టి కడ ♦ పాదము వట్టుచు క్రిందుమీదునై
పొంగుచు వేఁడు చుండు నటు ♦ పోల్చునుబో యలివేణి పెన్నెఱుల్!

సుభ. యీపుష్పఫలంబులను మునీంద్రునియొద్దకు గొంపో యెదను–

అర్జు. - అదిగో సుభద్ర తిరిగివచ్చుచున్నది. నేను జపము చేయుచుందును.

సుభ. మహానుభావా! ఈ పుష్పఫలంబుల నందుకొనుఁడు.

అర్జు. రామా! (అని కనులువిచ్చి) వెలఁదిమిన్నా! ఏవీపుష్పఫలంబులం దెచ్చితివా? చేజాపుము-ఫలములను గూడ దెచ్చితివా? ఇటు దెమ్ము-

సుభ. మహామహా! ఇదె మహానీయు లంగీకరింతురుగాక-

అర్జు. కాంతామణీ! కుసుమములనా దెచ్చితివి?

సుభ. ఇవి మీ మనంబునకు రాకున్న మీగోరిన పూలఁ బేర్కొనుఁడు తక్షణము దెత్తును.

అర్జు. (స్వగతము) అడిగిన నడిగెదను గాని నీవు తక్షణ మిత్తువా? అయ్యో! నా వెఱ్ఱి- నా కోర్కెయిట్టి దని తా నెఱింగిన నీపల్కు పల్కునా? నా కీ సంతోష మిచ్చునా? (ప్రకాశము) తన్వీ! ఇప్పటికే చాల నలసితివి- చాలును-

సుభ. ఆజ్ఞ- మానీంద్రా! యీఫలముల నంగీకరింపుఁడు. ఈపానీయంబుల స్వీకరింపుడు-

అర్జు. (స్వగతము) ఈపానీయంబు లిచట గోరు వారెవరు? (ప్రకాశము) కొమ్మా! యీ పండ్లతిసుందరముగ నున్నవి. ఇంతకన్నను రమణీయమగు ఫలములు లేవా?

సుభ. ఋషికులతిలకా! ఈ యుద్యానవనవాటిక నున్న ఫలంబు లన్నిట నివియే శ్రేష్ఠములు. అందుననే మీ కర్పణఁ జేసితిని-

అర్జు. రామా! (అనియూరకుండును)-

సుభ. యతీంద్రా! నేను బోయి భోజన సామగ్రిం దేర నా
జ్ఞ యొసంగుడు.

అర్జు. రామా! అట్లనే చేయుము— గాని నీ వతిశీఘ్రముగ
రావలయును సుమా నే డర్చన నతివేగ గడతేర్చెదను—

(సుభద్రపోవును)

అర్జు. (స్వగతము) అక్కటా! సుభద్రా! ఈవనవాస మిం
కెన్నినాళ్లు చేయుమందువో గదా! మనోహారిణీ!

గీ. ఎండతాకినఁ జలి ♦ యొక్కఁడైనను వానఁ
దడిసిన మది నిన్ను ♦ దలఁతు నబల!
సర్వవేళలందు ♦ సంస్మరించెద నిన్ను,
నీవిమోక్ష మిచ్చి ♦ కావరాదె!

మన్మనోరథమా! నీకొరకే నింత శ్రమ పడుట గానవా
హా! హతవిధీ! యేమి సేసెదను! ఆఁ! మరచితిని. ఇప్పు
డే శ్రీకృష్ణుండు బలరాముని తోడ నిందుధరోత్సవంబు
నకు పదియామడ దూరంబునకు పోయెనని కదా సుభద్ర
చెప్పెను— నిక్కముగ నిది—

గీ. చిన్నతనమున నుండియు ♦ జెట్టఁబట్టి,
తన్ను గాచెడి వాఁడగు ♦ చిన్నికృష్ణు,
నేఁత యౌ నిది నాకొఱ ♦ కాతఁడిట్లు,
బలుని గొనిపోయె దవ్వు ♦ ల వలను గలుగ.

అట్లయిన నేమి సేయువాఁడ (ఆలోచించి) యెద్దియు తో
ఁచదుగదా! ఏమిసేయుదును? హా! కృష్ణా! నీదేభారము.

గీ. లక్క యిలునుండి గాచిన ♦ రక్షకుఁడవు
తోడివానిగఁ జూచిన ♦ వాఁడ వీవు
ఈడ నుండఁగ నియమించు ♦ వాఁడవీవు
ఎట్లు దయనిత్తువో నాకు ♦ నింత నిపుడు.

అదిగో సుభద్ర వచ్చుచున్నది—

సుభ. (ప్రవేశించి) మునినాయకా!

అర్జు. (స్వగతము) మనోనాయకా యన్న నెంత రమణీయముగ నుండునో గదా!

సుభ. మునినాయకా!

అర్జు. రామా! అపస్తువుల నటు బెట్టుము.

సుభ. (అట్లుచేయుచు) ఆజ్ఞ—

అర్జు. అది యేమి సుభద్రా? శిరమున—

సుభ. (తుడుచుకొనుచు) ఋషివరా! యేమియు లేదు—

అర్జు. అటు కాదు బాలా! యిటురమ్ము! శిరమువంపుము—

సుభ. ఋషివరు నాజ్ఞఁ దాటఁదరమా? (శిరమువంచును)—

అర్జు. (తీయుట నభినయించి తనలో) ఆహా! మన సెంత హాయిగనున్నది—
(ప్రకాశము) కాంతాశిరోరత్నమా! యేమియో యనుకొంటిగాని నీశిరమున సుమపరాగముగాని మరియొకటి గాదు. ఈ శుభసూచకంబున కనతికాలంబున వివాహంబు జరుగ నోపు—

గీ. దేహ మంటిన మాత్రాన ♦ దెప్పరీతిఁ
దేఁజొచ్చెను నామది ♦ వేల దాటి

వచ్చు హాస్యాక్షి నింక నీ ♦ మెచ్చులాడి
నన్ను గూడిన వచ్చు నా ♦ నంద మేమొ!

సుభ. (సిగ్గున మాటాడకుండును)

అర్జు. యువతీ, ఏల యిట్లు సిగ్గుపడుచున్నావు? నేఁ జెప్పినది తప్పదు. ఇంతియే కాదు, ఇంకొక విశేషము కలదు. మంజరితకర్ణపూరలోభమున నీమగతుమ్మెద యెట్లు మాటిమాటికి వ్రాలుచు విడువకున్నదో? దీనినిఁబట్టి నీహృదయము నెవ్వనికి సమర్పించియుంటివో యాపురుషుఁడు నీకొఱకై యే తిఱుగుచుండును దెలియఁజేయుచున్నది.

సుభ. (స్వగతము) ఆహా యేమి యీమాటల గాంభీర్యము! నా మనోనాథుఁడు నాకొఱకే తిరుగుచుండెనా? నా మనోనాథుఁ డర్జునుఁడే కదా! అతఁడు నాకొఱకు తిరుగుచుండుట యెట్లు తటస్థించును?

అర్జు. బాలా, మాటాడవేల? నామాటలలో నబద్ధముండునని నీవు, అట్లెప్పుడును దలఁపఁబోకుము.

ఉ. కాంచితి దివ్యదేశములఁ ♦ గంటి మునీంద్రుల, వారిసేవచే
మించితి, సర్వవేదనయు, ♦ మేటిబలంబునఁ గర్మబంధముల్
ద్రుంచితి, నెల్లసౌఖ్యముల ♦ తోఁ బని యంతయు దీరియుంటఁ గాం
క్షించితి మోక్షసౌఖ్యమునె ♦ క్షిప్రగతిం గనఁజాలియుంటకున్.

కావున, నే నసత్యమాడవలసిన యవసరము లేదు గదా.

సుభ. (స్వగతము) మహానుభావుఁడగు నీతని మాటలలో నసత్యముండఁగూడదు. కాని, నే నిప్పుడేమి చెప్పుటకును నా

కుఁ దోచకుంటచే, ప్రసంగాంతరముచేయు మిషచే నా యర్జునునిగూర్చియే ప్రసంగించెదను. (ప్రకాశముగా) మహానుభావా, మీమాటలయందు నాకు నమ్మకము లేకపో లేదు గాని, మిమ్ము దర్శించినదాదిగ మిమ్మొక్కయంశము నడిగి తెలిసికొనవలెనని యున్నది. మీరిప్పుడు నా క్షేమ వార్తంగూర్చి నడుగుచున్నారు కావున, నైహికాంశము లంగూర్చి మీతో మాటాడుటకిది సమయము కావచ్చు నని యనుకొనుచున్నాను.

అర్జు. అడుగవచ్చును. అడుగుము, తప్పేమి?
(స్వగతము) ఏమడుగుచునో.

సుభ. సర్వజ్ఞులకు మీకు దెలియని యంశములుండవు. మీ రెప్పుడైన మీదేశ సంచారమున నింద్రప్రస్థమునకుఁ బో యియుంటిరా?

అర్జు. (స్వగతము) ఏమి యిట్లడుగుచున్నది?
(ప్రకాశముగా) పోయియుంటిని.

సుభ. పాండవులఁ జూచినారా?

అర్జు. జూచితిని.

సుభ. (అడుగఁబోయి సంశయించును)

అర్జు. సంశయమేల? అడుగుము.

సుభ. పేరాధనీయుఁడగు నర్జును నెఱుఁగుదురా?

అర్జు. (స్వగతము) హృదయమా, తందరపడకుము. అర్జునా, నీవు ధన్యుఁడవుసుమా, వెదుకఁబోయిన తీవ పదములకే తగులుటఁ భాగ్యము కాదా.

(ప్రకాశము) అర్జును నెఱుఁగని వా రుందురా? ఒకప్పుడు నేను నాతఁడును గలసియే సంచరించుచుంటిమి.

సుభ. ఏమీ-అర్జునుఁ డింకను సంచారమే చేయుచున్నాఁడా? పాండవులందఱునా, లేక యాతఁ డొక్కఁడేనా?

అర్జు. ఆతఁ డొక్కఁడే.

సుభ. ఆతఁ డొక్కఁడే సంచరించుట కేమి యవసరము వచ్చెను?

అర్జు. ఆతఁ డెవ్వతెయో కాంతను బెండ్లియాడఁగోరి యతి రూపధారియై దేశసంచారము చేయుచున్నాఁడట.

సుభ. (స్వగతము) హృదయమా! ఏల నీ కీ యాందోళనము? నీసర్వస్వము నాతని కర్పించినంతమాత్రమున నాతఁడు మఱియొక్క కాంతను బెండ్లియాడఁ గూడదా? ఇంతకును నే నా తని వలచితినని యాతనికిఁ దెలియునో తెలియదో? (ప్రకాశము) అట్లయిన నీయూరి త్రోవను వచ్చునా? లేక యిట్లే తిరిగిపోవునా?

అర్జు. (స్వగతము) ఈమె నిప్పుడే పరీక్షింపవలయును. కోమలాంగీ! ఈయర్జునుని గూర్చి యింతగా యడుగుటకు గారణమేమియో తెలియక సంశయము గల్గుచున్నది.

సుభ. సంశయ మెందులకు?

అర్జు. తక్కిన ధర్మజ భీమ నకుల సహదేవులుకూడ నీకు బాంధవులే కదా!

సుభ. అయ్యో! కాకేమి?

అర్జు. అట్లయిన వారలఁగూర్చి యేల యడుగ లేదు?

సుభ. యతీంద్రా! వారిం గూర్చియు నడుగుటకు సిద్ధముగ నున్నదాననే.

అర్జు. ఏమీ! అగ్రజులు ధర్మజ భీము లుండ నర్జునుగూర్చి యా తొలుత నన్నడుగుట? అంతగా వీనియందున్న యొక్కుడేమి?

సుభ. మునీంద్రా! తెలిసియు మీరిట్లానతిచ్చిన నే నేమి సేయుదును? వానియం దెక్కుడు గానరాలేదా? సర్వలోకరాజవరేణ్యులును జేతగాక సిరములువంచుకొనియుండ మత్స్యయంత్రంబు తెగనేసిన వీరుఁడర్జునుఁడా కాక ధర్మజానులలో నొక్కండా?

అర్జు. అవును నరుఁడే తెగ నేసె నట—

సుభ. ఋషిసత్తమా! అందులకుగా జరిగినయుద్ధఁబున శత్రు రాజులనంనజీని పలాయమానులుగఁ జేసిన యాతఁ డర్జునుఁ డేగడా? ఇంతకన్న నెక్కుఁ డేమికావలయును?

అర్జు. (స్వగతము) తావలచినది రంభ యంట. (ప్రకాశము) సుభద్రా! నీమాటలఁ బట్టిజూడ నీ వర్జునునియం దనురాగివఁయియున్నటుల గానుపించెడిని. నీ వాతనిం గోరెదవా?

సుభ. (స్వగతము) అక్కటా! ఈప్రశ్నంబున కుత్తరం బెటులిత్తును? ఏ మని దెల్పుదును? దెల్పిన నాకనుకూలంబు సేయఁడా? చేయును. ఇడ్లనిచూచెదనుగాక—

అర్జు. మౌన మర్థాంగీకార మని యూహింపనా?

సుభ. ఋషిపతంసా! నాయంగీకారమువలన లాభమేమి?

అర్జు. లాభమేమియా? అంగీకరించిన వానినిపుడే యిటకుఁ

దెప్పింతును.

సుభ. ఎఱుగక యడుగుచున్నదానను. అది మీకు సులభ సాధ్యమేనా?

అర్జు. ఓసీబేలా! మాకు సాధ్యమా యనియా యడుగుచున్నావు? భూమిని మా కసాధ్యము లెవ్వి? మాకుకరుణగల్గిం నెంతటి కార్యమును నైన సేయఁగలము. నమ్మియుండుము.

సుభ. అగు నగును అట్టులనేగదా పెక్కుసారులు వినియున్నదానను. పరమకృపానిధీ! నాపై గరుణించి యా యర్జును నాథును నిటకు రప్పింపుము.

అర్జు. తెప్పించుట యొక కష్టమా? తెప్పించినం దప్పక యాతని నంగీకరింతువా?

సుభ. (స్వగతము) అక్కటా! ఈప్రశ్నంబున కే నెట్టి యుత్తరు వొసంగుదును?

గీ. వల్లె యన్నను తెగువగా ♦ వనితలందున,
కాదు కా దన్న నర్జును ♦ గాంచునట్టి
భాగ్య మబ్బుట యెట్టులో? ♦ పాపబుద్ధి!
యేమి యుత్తర మిత్తునో ♦ యితనికిప్డు?

అక్కటా! మాలదైవమా! న న్నేల నిట్టి విచారసాగరంబున ముంచెదవు? ఈఋషివరు నిటకు రప్పింప నిన్నెవరు వేడిరి? వేడిరిపో యాతనికి నాయం దిట్టి కృపఁగలుగఁ జేయ నిన్నెవరు ప్రార్థించిరి? ప్రార్థించిరిపొమ్ము. ఆయన నీ ఘనతర కార్యంబునకు నింత సులభమార్గంబు జూపనేల? చూ

పై-నాకీ ప్రతీకారపుటూహ లేలగలుగవలెను? హతవిధీ! నాతో నీకీ దోబూచికూట లేల? ఏమందును? (ఆలోచించి) సిరి రా మోకాలొడ్డు వా రెవ రుందురు? తప్పక వల్లెయనుటయే కర్తవ్యంబు. వల్లె యన్న నేస్వతంత్రనా? నా చేయున దేమికలదు? నే నేమి చేయ లేకున్నను అఘనభుజుండు తా నే సర్వము వర్తించును.

అర్జు. ఏమితన్వీ! యెంతసేపీ యూహలు? బాలా! మోహిజ్జనరత్నమా! నిక్కము పల్కుము. లేకున్న నా ప్రాణస్నేహంబునకు భంగంబు గల్గును సుమా — యోచించి బదులు పల్కుము.

సుభ. (స్వగతము) అక్కటా! యిట్టిసమయము మరి నాకెప్పుడు దొరకును? వెల్లుగలయుపుగదా చక్కఁజేసికొనవలయును? (ప్రకాశము) పరమపురుషా! తెప్పింపుడు.

అర్జు. తెప్పించుటకా యింతయోచన? తప్పక యంగీకరింతుపుగదా.

సుభ. మునికులతిలకా! ఆవృష్ణివీరుఁడు వచ్చి కానుపించిపోగూడదా?

అర్జు. పోవచ్చునుగాని యేకారణంబున కాతఁడు వచ్చునో రాడో? నిక్కువము చెప్పజాలను. ప్రయోజనము లేనిరాకపోక లేల?

సుభ. అక్కటా? యీచిక్కు తప్పుటెట్లు? హా దైవమా! నీదే భారము-ఏమిసేయుదున్నావో? (ప్రకాశము) అట్లనే చేతును.

అర్జు. నిక్కువమేగదా—తరువాత నాయాగ్రహంబునకు పాత్ర వయ్యెదవుసుమీ.—

సుభ. తప్పక యంగీకరింతును.

అర్జు. సూనృతమేకదా!

సుభ. అందులకు సంశయింపవలదు.

అర్జు. వానిం జూచి పరుగిడిపోదువేమో?

సుభ. మునినాయకా! అట్లుసేయను.

అర్జు. అటుగాదు; అటుసేయనని చేతిని చేయివైవుము.

సుభ. (సంశయించి నిలుచును)

అర్జు. ఓసి బేలా! సంశయమెందులకు? గురువరునిగ నున్న నాయందు నీకు సంశయమెందులకు?

సుభ. మీచిత్తము (అని అట్లనేచేయును.)

అర్జు. (సుభద్రచేయిపట్టుకొని)

గీ. అతివ, నిన్నుఁ గోరి • యర్జునుఁడేవచ్చి
తపసివేషమిచటఁ • దాల్చినాఁడు;

సుభ. (లజ్జనభినయించుచు)

చాలుచాలు, నింక • జాలు, నీమోసంబు
తపసి వనుచు నిన్నుఁ • దలఁచియుంటి.

(అనిచేయి విడిపించుకొనఁ జూచుచు)

ఎంత మోసపోయితిని?

అర్జు. గీ కరముబట్టినాఁడఁ • గాంతరో, పాణిగ్ర
హణమునయ్యె నీకు • నర్జునునకు;

జేయివిడువఁజేయు ♦ న్యాయమా నీకిది?
కోరివచ్చినాఁడ ♦ వేఱుగాదు.

సుభ. కవిరాజవిరాజితము.

గురువరుఁ డంచు నెసంగితి చేరిని ♦ గోరిమె మోసము నొందితి హా!

అర్జు. గురు వన గొప్ప; వరుండన శ్రేష్ఠుఁడు, ♦ కూడని దేటికి కోమలిరో?

సుభ. సరిసరి చాలును దొంగిలివచ్చుట ♦ క్షత్రియధర్మమె ధారుణిలో?

అర్జు. తరుణులఁ జేకొన దొంగిలివచ్చుట ♦ ధర్మము దీని నెఱుంగవటే.

సుభ. చాలుచాలు నన్ను విడువుము.

అర్జు. కాంతామణీ! తొలుత నీవు మాట నీయ లేదా యర్జును నంగీకరింతునని?

గీ. ఆడితప్పిన వార లే ♦ యవనియందు
శిక్షకర్హులు గావునఁ ♦ జెలియ, నిన్ను
బట్టి విడుతునే, తేనియ ♦ లుట్టుపడెడు
మోవి నైనను గ్రోలక ♦ మోహనాంగి!

(ముద్దుగొనబోవును)

సుభ. (తప్పించుకొని)

గీ. ఎంత మోసము గాంచితి ♦ నేఁ ద్రిదండి
యంచు నెంచితి నిజముగ ♦ నక్కటకట!
పురుషు లెంతటివా రైనను ♦ బూనుచుంద్రు;
వారినమ్మంగ రాదుగా ♦ యేరికైన.

అర్జు. గీ. అట్టిమగవారి శారడి ♦ బెట్టి ముద్దు
గొనగ నీయక మిక్కిలి ♦ పెనఁగులాడు

సబల, వీవె చాలుదు వెంత ♦ కైన మునిగ
నిట్లు జేయఁగ జాలిన ♦ దీవెకాదె!

సుభ. చాలుచాలు నన్ను విడువుము

అర్జు. పంచచామరము.

పరీక్ష యేల రమ్మ మాయ ♦ బాణముల్వితీక్ష్ణముల్
విరాళి నొందజేసె నన్ను ♦ వేగఁజూడు చూపులన్

సుభ. ధరిత్రి మీరు తాపసుల్గ ♦ దా విరాళి జెందుటా?
కరంబు చిత్ర మిట్టిమాట ♦ గట్టిపెట్టె మేలగున్.

కాదు కాదు మీవంటియతులకు మరుండేల బాధఁగూర్పఁడు.

అర్జు. మనోహరాంగి! అట్లనెద వేమి?

గీ. చెలియ, నీదు కటాక్షము ♦ గల్లిగనేని
మాయ డెంతటి వాఁడల ♦ మారహరుఁడు
తానె బాలకె యోడెను ♦ తన్వి, భువిని!
రమ్మ! తేనెలొల్కెడు నధ ♦ రమ్ము నిమ్ము.

సుభ. అట్టిపౌరుషశాలురా మీరు!

పంచచామరము.

నిజంబు నీదు పౌరుషంబు ♦ నీట లీఁకుమయ్యెనో?

అర్జు. గజేంద్రయాన, కాగనోపు ♦ కాముపూవుటమ్ములన్
భజింతు నీదు నామమెప్డు ♦ పట్టి ప్రోవవేఁడయన్.

సుభ. అజేయ, యిట్లు స్త్రీని వేడ ♦ నర్హమౌనె నీ కిలన్?

ఏకాంతంబుననున్న కాంత నోర్తు నీ రీతి సేయు నర్హామగునా నీకు? దీనిని విన్న వారు మెత్తురా?

అర్జు. మెత్తురుగాన నే నీ కార్యంబు సేయఁబూనితిని. అతివా! ఆచింత నీ కేల? ఇనుమంతయైన వలదు. రమ్ము (అని రెండుచేతుల కౌగలించ బోవును)

సుభ. (తొలఁగిపోయి)మారా కారా! మాయన్న బలరాముఁడు దీని విన్న ప్రాణంబులుండనీయఁడుగదా.

అర్జు. ఏమీ! బలరాముఁడా—నిండుమనంబున నిచ్చు గదా యని యుంటిగాని కృష్ణుండు రుక్మిణింబలె నిన్నుఁదోకొనిపో నాకు కష్టతరమే?

గీ. బలుఁడుగాఁడు కాని ♦ బలమెల్ల నొక్కటవచ్చి తాక నిమ్ము ♦ వారిగెల్తు,

సుభ. చాలు నీదు లావు ♦ శత్రుఁడైనబలుండు
ఎట్టివారికైన ♦ నీసడించు.



అర్జు. గీ. నమ్ము, చెలియ! నీవు ♦ నాబీరమంతయు,
దిగ్విజయము జేసి ♦ దేజరిలితి
నట్టివాఁడనయ్యు ♦ నబల, నీమాటల
కోడియుంటేఁ గరుణ ♦ జూడరావె!

సుభ. నీబీర మంతయు నే నెరుంగనిది కాదు—తాలి మింతయు లేదు—నే నేమి సేయుదును—బలుఁ డన్న నత్యంత భయముండు గదా!

అర్జు. ఈ మోమున నవ్వు వెన్నెలను ♦ మోవిని గ్రోలగ నెంచి వచ్చి యో
లేమరో, నీ కురు ల్నడుమ ♦ లీనము గాఁగనుఁ జిక్కి దక్కితిన్,
ప్రేమను బెంచు గాని నను ♦ బిట్టర మారుకటారి బారికే
నామిష మైన యట్లు నను ♦ నమ్మకుమీ సఖి, నమ్మితిన్నినున్.

సుభ. చాలు-చాలు

గీ. కూడ దని యెంత చెప్పిన ♦ గోల వగుచు
మాటిమాటికి నడుమ ని ♦ దేటితగవు?
బోటులను జేడ నిదియు నే ♦ పాటి యకట!
మాటలను మాను; లేకున్న ♦ మాటరాదు!

అర్జు. సఖీ! నేను నీవాడనై తిని రమ్ము నన్ను

ఉ. చాలునె, యేలు నన్ను మది ♦ జాలిని దాల్చి లీలమై యికన్
దాలఁగజాల; మారుఁ డిదె ♦ తాలిమి దూలఁగ కోలల న్వడిన్
జాలుగ నేయఁజొచ్చె నిఁక ♦ జాలును లోకము మేలుడించెడిన్
బాల, యిదేల జాల మిక ♦ బాలిని గేలను గ్రుచ్చి మేలగున్.

రమ్ము (అని కేలువట్టి అంకించుకొనబోవును).

[ తెరలోపలధ్వని. ]

సుభ. అక్కటా! సుందరాకారా! విడు విడు యెవ్వరో వచ్చు
చున్నట్లున్నది.

అర్జు. (విడుచును)

సుభ. (పరుగిడిపోవును)

అర్జు. అక్కటా! యెంతమోసపోయితిని? చేజిక్కిన దానిని పారవైచుకొంటిని. ఈ పెంపుడు రాజహంస లేల నిప్పుడేవచ్చెనుగదా! హా! దైవమా!

చ. వడివడి స్రుక్కి స్రుక్కి కడు ♦ చూర్ణముజేసియు దేహమంతయుఙ్
కడ కవి చిక్కఁ జేసికొన ♦ గారడియేమియొ నేనెఱుంగ నా
పిడికెడు తండులంబులును ♦ వేసగమా నదిగాఁ మానవుల్
తొడఁబడు టింతెకాని యల ♦ దైవము కాఁడటె కార్యనేతయా!

అక్కటా! ఇంక నేనేట్లు తాళగలను? హా! క్రిష్ణా, నా ప్రయత్నములన్నియు వమ్మాయెనో. దైవయత్నమున్నది. హా (అని మూర్ఛిల్లును)

[ప్రవేశము సత్యభామ]

సత్య. అక్కటా! యీత్రిదండి యేలనో విచారగ్రస్తునిగతి కానుపించెడు. పోయి కారణ మరయుదును గాక (చేరి) ఋషితిలకా!

అర్జు. రామా!

సత్య. నీ రామ యింకను రాలేదా?

అర్జు. (తటుకున లేచి) సోదరీ! సత్యా! మాబావగారేమిచేయుచున్నారు?

సత్య. నీకొరకై శ్రమబడుచున్నవారలు.

అర్జు. అది యేమి?

సత్య. అర్జునా! మాభావగారున్న నీ వివాహంబునకు ప్రతీ

కారంబుసేయు ననియెంచి యాతని నింద్రధరోత్సవంబునకు దవ్వులకు గొనిపోయిరి.

అర్జు. అయ్యో! శ్రమ పడిన నేమి? పడకున్న నేమి? యిల్లలికినంబంతువ యగునే?

సత్య. కికికీ! యేల నట్లనుచున్నాడవు—

అర్జు. కాదుసోదరీ! ఆసుభద్ర నన్నంగీకరించిన గదా—

సత్య. నీపేరుజెప్పిన సుభద్రయంగీకారమన నెంత?

అర్జు. అయ్యో! సోదరీ!

గీ. పేరు దెలిపితి నే నింత ♦ బేలనైతి;
కోర్కె యొతింగి యేయింత ♦ గోలనైతి,
అందరా నట్టి ఫలముల ♦ కాసజేసి
వచ్చినాడను శ్రమ కిక ♦ ఫలములేదు.

సత్య. ఆఁ! ఏమి? అర్జునా! నీపేరుజెప్పిన నిన్ను పెండ్లియాడ ననెనా? యేమి?

అర్జు. పేరేకాదు నేనే యర్జునుఁడ నని దెల్పినను విడిచి పోయెను.

సత్య. ఆఁ! విడిచిపోయెనా? విడిచిపోక నీతో గూడనీవనమున కాపురము సేయువలయునా?

అర్జు. సత్యా! అదికాదు. నన్ను దప్పించుకొనిపోయెను.

సత్య. (నవ్వుచు) అందులకా నీవిచారము? సుభద్ర మగువయగునా! కాన సిగ్గున పారిపోయెను, గాని వేఱుగాదు. ఐన నీకార్యము నిన్నెవరు సేయుమనిరి? అందులకు నియోగింపబడ్డ మే మున్నారము గదా

అర్జు. తానే నన్ను కిరీటింగూర్చి ప్రసంగించెను.
సత్య. ప్రసంగించెనుగదా!
అర్జు. ఆఁ! ప్రసంగించెను.
సత్య. అదిచాలదా! అందువలన నామె కర్జునునియందను రాగ మున్నట్లు దోచెనా?
అర్జు. అట్లనే తోచెను మాటలలలో—
సత్య. మాటలోనున్న కార్యంబులలో నగు పెంతపని?
అర్జు. ఏమేమిసోదరీ! నీ ర్దుడుచు మాటలేమో?
సత్య. కావు కావు, నమ్ముము నేను బోయి ఆసుభద్ర యెట్లు నిన్ను వివాహమాడదో చూచెదను. నీభోజనమైనదా?
అర్జు. విచారముతో కడుపు నింపుకొనుచునే యున్నాడను. మరివేరు భోజనమేల?
సత్య. యేమీ! యింకనూ భోజనములేదా? అయ్యో! రమ్ము రమ్ము.

[నిష్క్రమింతురు.]



# పంచమాంకము.

[రంగము—సుభద్రయంతిపురము]

పరివేశము—సుభద్ర పండుకొనియుండ రుక్మిణివిసరుచుండును.

సుభ. అక్కటా! యీకోకిలకులంబుసహితము నాపై కక్షు వహించియున్నదిగదా! యేమీ గర్వము!

చ. గొలగొలలాడుచు న్మృగులఁ • గో యని కూయఁగ నేల కోకిలా!
యిల కలకంఠివన్నఁగని • యింతటిగర్వమునంద మేలటే?
మలినము గాదె దేహ మల • మ్రాసన గాదటె నీదు పిల్కుడల్?
చలమున మాలకాకి నిను • చంచున నొవ్వఁగ జేసిత్రోలదే!

కోకిలా! గర్వముడుగుము. రుక్మిణీ! అపారుచున్నది యేమగును?

రుక్మి. అమ్మా! సుభద్రా! అది సాయంసమయము మించి చాలజాగాయెగా యని వడివడి బోవు జక్కవ—

సుభ. హా! జక్కవా! నీవయినం దయయుంచి నా నాథు నిటకుఁ దోడితేరాదా?

ఉ. ఎక్కడనైన నాథుఁ డొకఁ • డించుక జాగును సేయఁగానె నీ
పక్కట! యంచు నేమనుచు • హాయనుచుం గదుదీన వక్త్రపై

మిక్కుటమైన బాధలను ♦ మేను సహింపఁగఁజాలమండునో,
జక్కవ! కాంతుదేవె, యెద ♦ సంతసమొప్పఁగ నిన్ను గూర్చెదన్.

రుక్మి. అమ్మా! సుభద్రా! రాత్రియగుచున్నది. చూడుము.

చ. కలువలువిచ్చె, తారకలు ♦ కాంతిని హెచ్చె, పయోజరాజిలో
చెలువముడిందఁజొచ్చె, కడుఁ ♦ జీకటిక్రమ్మమవచ్చె, బోరుసూ
హాలు వెసతెల్వినెచ్చె, విర ♦ హార్తులకారడిఁదెచ్చె, మారుఁడా
సలువడినూర(గుచ్చె, సఖి ♦ సారిక, పల్లవునాత్మబాహులన్.

రాత్రియగుచున్నది. ఇంచుక నీ నిట్టూర్పులు మాని నిదుర వ్రోవరాదా?

సుభ. అక్కటా! అగ్ని కాజ్యంబు చాద్పున నీ వేదనకుఁదోడు యీమన్మథహతకుఁడు నన్ను నేచుచున్నాడుగదా యేమిసేతును. ఓరీ! మన్మథా! నీకేలరా యింతగర్వము, యింతి నేయుటయు నొకఘనమా? అవు నదియే నీబోఁటి పౌరుషహీనులకుండఁదగినది.

చ. శరములు నీరజంబులట, ♦ చాపము తీయని కబ్బమంట, బం
భరములు వింటినారియట, ♦ వాహన మన్నను జిల్కయంట, యా
శిరితనయుండవంట, యిటు ♦ సేయగ నెట్లలవాటు పొందితో,
మరుడ! యిదేమి మోటరివె ♦ మమ్మునసాధల నేచ నిమ్మెయిన్!

అక్కటా! చుట్టు నెట్టివిషయంబులున్నవేమి? మనముకదా ప్రధానము సంపర్కం బినుమంతయైన నన్ను మంచివ్యానిగ చేయజాలకున్నది. హా! అర్జునా! నన్నేల విడచితి?

రుక్మి అమ్మా! సుభద్రా! యేలనంతటి యాయాసంబు నొం

దు చున్నదానవు?

సుభ. వదినే రుక్మిణీ! ఏలనోగాని నామనంబు సరిగాలేదు. నేనెట్టులూరకుందును?

రుక్మి. అందులకు కారణమేమియో చెల్పవే.

సుభ. ఎరిగిన నే జెప్పనా!

రుక్మి. అక్కటా.

క. రోగము దెలిసిన నౌషధ
మే గతినైనను నెవరికి నిత్తువు గాకా
లాగున దెలుపక యున్నను
బాగగునె, చికిత్సఁజేయ భయమౌ గాదే?

యింక తాళుము. నీనిశ్వాసంబులఁ గట్టిపెట్టుము.

సుభ. (వినకయే) వదినే! ఈసెజ్జ నేమి యున్నాదో చూడుము.

రుక్మి. సుభద్రా! అది యే మట్లనుచున్నదానవు. ప్రతిదినము నీ వే సెజ్జపై పరుందువు?

సుభ. అతికోమలములైన పూల సెజ్జపై పరుందును.

రుక్మి. అట్టిపూసెజ్జయే యిది? యేల యింత వింతగ నడిగితివి?

సుభ. రుక్మిణీ! దినమునట్లుగాక నేడేమో కరకుములుకులు దేహమునఁ దాకుచున్నవి. ముండ్లనుగూర్చె నేమో చేటి-చూడుము అదియేమియో—

రుక్మి. (సెజ్జచూచును)

సుభ. (స్వగతము) ఆహా! అర్జునా! ఇంక నా కా పొందు గల్గు టెన్నఁడో గదా దైవమా! నీవు లేకున్న నాకీ సౌభాగ్యము లేల?

రుక్మి. అమ్మా! సుభద్రా!

గీ. దిరిసెనపుమొల్లలను జాల ◆ దెచ్చి నీదు
సెజ్జ గావించితిరి గాని ◆ చెలియ, కలుష
కోరకమ్ములతోడను ◆ గూర్చలేదు
పిలదూకెన? మాలతి ◆ చెలియటవె!

ఒక్కటైన కరకుములుకు గానరాదు. రమ్ము-పండుకొనుము. నీ యాయాసమే నిన్నట్లు జేయుచున్నది. అదిగో వెన్నెలరేడు పండువెన్నెల గాచుచు నుదయించెను.

సుభ. ఓరీపాపీ! క్రూరా! వచ్చితివటరా!

ఉ. నీకును మాకు దల్లి సతి ◆ నీవత నీడ్చితి గాకరంబులన్,
పైకొను తమ్ము లందుగల ◆ వైభవమంతయుఁ జారద్రోంతిగా!
యేకడ విప్రుడింగన ◆ కెంత, నసాధుల సేచువాఁడ, నీ
రాకయుభీతినిచ్చుగద ◆ రా! మముబొట్టను నో నిశాచరా!

తల్లి పుట్టినిల్లు గల్గియు నింత క్రూరుఁడ వైతివిగదా. అక్కటా! పుట్టుకకును, ఘనంబగు మనంబు గల్గియుండుటకును గల సంబంధమేమి?

రుక్మి. ఔనౌ. బాగుగ నంటివి.

గీ. పెద్దవారిండ్ల ◆ బుట్టియు ◆ నేరికైన
గుణము గల్గని మూఢులు ◆ పెక్కు లగుట;

పేదలయ్యును సుగుణులఁ • బెక్కు జనుల
గాంచుమాన్యము గాదటే • కల్కి, మనము!

కాన నీవన్నట్లు నిక్కముగ జన్మమునకును గుణమ్మునకును చాలదూరము.

సుభ. ఓరీదోషాకరా! ఎంతజెప్పిన న్మానవేమిరా?

శా. ఔరా! రాజవుకాని మాట, వినుమా • యన్నంచు మన్నింప నీ
వీ రీతి న్ననురాజకాంత నిశి యం • దేడ్పింప నూహించెదే?
నీరేజాస్యల నేచఁ బూని మరునా, • నీతోడుగా గొంటివ
య్యారే! రా జనుమాట నీవలనపో, • యయ్యెం గళంకంబుగాన్.

రుక్మి. అక్కటా! చూడఁచూడ నిది వేరుగదోచుచున్నది.

గీ. చలువచేసెడివీనిని • సైచకుంట
వేడి నిట్టూర్పు లనిశంబు • విడుచుచుంటి
హేతు వేమన్న తానది • యెరుగనంట
తప్ప దిద్ది యనంగుని • తాపమెయగు.

కాక వేరగునా? ఇదె చల్లని పవనకిశోరంబు వచ్చుచున్నది దీని తాకు డెట్టులో చూచెదనుగాక. సుభద్రా! నీనిశ్వాసములచే నీ మలయవాతపోతంబు వేడిసేయక సుఖంబున కంట కూర్కువెట్టుము.

సుభ. గీ. వాతపోతంబు గా దిది • పావకునకు
దోడుగా జనుఁ బట్టియ • తులువగాని

రుక్మి. ఆఁ! గంధవహు డట్టుమాటుస • గంబె నుడువు
కాదు పో యిదిమరుకాక • గాక యొండు.

సుభ. వదినే! రుక్మిణీ! ఈపాడుగాలి యేనా సుఖదం బని యం టివి? చాలుచాలు. నాకవాటంబులు మూయుము.

రుక్మి. పోని మట్లనే సేతును (అనిపోవును)

సుభ. అక్కటా! నాహృదయేశుని గూడియున్నప్పుడుగాక నీమందపవనున కీ గుణముపోవునా? అయ్యో! నాకరంబు వట్టికొని నన్నా సేలరాతిన్నె మీదికిం గొనిపోవుచుండ అయ్యో! నే నెల చేవిదుర్చుకొనివచ్చితిని? హా! అర్జునా! ఎన్నడువత్తువోగదా యని యువ్విళు లూరుచుండ వెదక బోయిన తీగ కాలికి చుట్టుకొన్నట్లు నీవె వచ్చి నా కరంబు వట్టినప్పుడు నా కేల నీపాడు సిగ్గుగల్గినది? ఆహా! సిగ్గా! ఎట్టిసమయంబున నన్నధిష్ఠించితివి? నీవలనగదా నాకింతవం తగలిగెను. ఇంకనైనను నాబోటి బోటులు తమనాథులం గూడ బోవునప్పుడు నీవేగి వారి కార్యంబునకు ప్రతీకారం బు సేయబోకుము. నిన్వేడుకొనియెద.

రుక్మి. సుభద్రా! యిప్పుడైన నీకు శాంతిగల్గెనా? సుఖంబు గ నున్నదా?

సుభ. (స్వగతము)సుఖమా! అక్కటా సుఖమునకును నాకు ను చాల దవ్వయ్యెను.

చ. మునిగతి నెంతయో శ్రమను • బొంది మనంబున, నెందువానకుఁ
ఘనముగ నోర్చి నన్ను గొన • గా సమకట్టినయట్టివాని, నా
యనువగు రూపువాని, హృద • యాధిపు, నక్కట! త్రోసివచ్చు నా
యనయవివేకదూరను మ • హాపతితన్సుఖ మెట్లు చేకురుఁ?

నా చేయి తనచేత నిడుకొని "నేనే యర్జునుఁడను" అను నప్పుడు నాకుఁ గల్గిన సుఖమే నాకు తుదిసుఖము—హా!

రుక్మి. సుభద్రా! యింకను నీహాహానాదంబుల మాన వేమి? (స్వగతము) ఇది మదనవేద నన్న-నందులకు గారణ మేమి యగును? (ప్రకాశము) సుభద్రా! అమ్మా! నీశరీర మునంగల బాధ యేమియో యెరుక సేయరాదా? నిన్నుఁ జూడ నాకు విచార మగుచున్నది. ఇదిగో సత్యయు నిప్పుడే వచ్చుచున్నది.

[ప్రవేశము:—సత్య.]

సత్య. ఏమే? వదినా! అంతకంతకును నాంచారి వగుచున్నావు—(అనిరుక్మిణికి చేసంజ్ఞ చేయును)

సుభ. ఓహో! సత్యభామ వచ్చినది-ఇంక నా గుట్టు బట్టబయలు పెట్టును. హా, అర్జునా! న న్నేల నీ విపదంబుధి బడ నేయఁదలఁచితివి? (ప్రకాశము) సత్యా! యేలనే అట్లనుచున్నావు?

సత్య. ఏమియు లేదు-అంతఃపురంబుననే నీవుంట?

సుభ. ఔను కాక మరెందుల నుందును. (స్వగతము) యేల నిట్లడుగుచున్నదో!

సత్య. అట్లయిన నీ యంతఃపుర కవాటంబులు మూయ కారణమేమి? స్త్రీలకుంగూడ కంటబడ ఫ్రొటు_

రుక్మి. ఇప్పుడా హా హా నాదంబు లెక్కడ కేగెనో? సత్య వచ్చిన చల్లగ మాట్లాడును. సత్యకాలపువారిని

చెవులు పట్టి యాడించును.

సుభ. ఎందులకు మూయించితినో రుక్మిణి నడుగుము. రుక్మిణియే మూసెను.

రుక్మి. నే నేమి చేసితిని? నీవు మూయుమన్న నే మూసితిని. నీమాట వినినందులకు నాదియా నేరము?

సత్య. సోదరీ! నేరమేమి! సుభద్ర యెందులకు మూయుమనెను?

రుక్మి. ఎందులకా? మలయగంధవాహుఁడు మందగతి సౌరణగండ్లలో దూరి యత్యానందదాయకంబుగ వీచుచుండ, నది రాగూడదని యీ కవాటములు మూయుమనెను.

సత్య. అంతయందముగనున్న నింకేమి సేయునో మన చిన్న సుభద్ర?

సుభ. ఎంత యందముగ నున్న నేమి?

సత్య. ఏమియా—అంతయందమగు మగఁడు లభించును.

సుభ. వదినే! మగఁడ నెదవేమి?

సత్య. ఏమీ! మగఁ డనరాదా? ఇట్టివారలే—

రుక్మి. అక్కా! తాళుము. సుభద్ర యేమియో చెప్పుచున్నది. సుభద్రా! అదియేమియో చెప్పుము.

సుభ. అదికాదు పురుషుఁ డనరాదా?

సత్య. ఓహో! రుక్మిణీ! చూచితివా? పురుషుఁడు—ఏమీ! సుభద్రా! మగఁడన్న చిన్న యయి పోయెనా?

రుక్మి. అక్కా! యింత సేయవలయునటే? సుభద్రా, పోనిమ్ము. నీకు జీవాధారపురుషుఁడే దొరకును.

సుభ. హా! అర్జునా! నీకిది యొక పెద్దపేరా? లేక పెరిగియున్న నాయనురాగంబున కిది యొక్క పెద్దయా? (ప్రకాశముగా) సత్యా! ఏలనే?

సత్య. అదిగో, నన్ను సత్యాయనకుము-మగఁడన్న నీ కెంత ప్రేమయో సత్యయన్న నా కంత కోపము కా దనుకొంటివా? అబ్బా! మగనిపై నెంతప్రేమ - సత్యభామా యనుము-

రుక్మి. అక్కా! ఏల నానుభద్ర నట్లు సేతువే?

సత్య. (చేసన్నఁ జేయును)-

సుభ. అట్లనే-సత్యభామా!-

సత్య. ఏమి-

సుభ. ఏలనే న న్నిట్లనియెదవు? నామది యేమియో బాగుగ లేదు-

సత్య ఔనౌను-నీమది యెట్లు బాగుగ నుండును-

రుక్మి. అక్కా! సత్యా! యేలనే అట్లనుచున్న దానవు-మన సుభద్రకు మది బాగులేకుంటకు కారణ మేమి యగును?- అపాయకరంబు కాదుగదా!

సత్య. ఓసీ బేలా! సోదరీ-కారణంబా? మగనిదగ్గర నుండకుంటయే-

రుక్మి. అవియా! యింత సేపెంత యాయాస మున్నట్లుండెను? ఇప్పు డా శ్రమ యంతయు నెక్కడి కేగెనో గదా? ఏమి యీ హాసము? ఏమియీ హాహారావంబులు-

సత్య. అబ్బో! చాన ఆపాటి వగలెరుంగ దనుకొంటివా?

సుభ. ఏలనే మీరిరువురును కలసి న న్నెగతాళి సేయుచు న్నారు? నిక్కముఁ జెప్పెదను వినుఁడు-నామనంబు నా యధీనము గాకున్నయట్లున్నది-

సత్య. ఔను-అది నీయాధీన మెట్లగును? అది నీహృదయేశుని యాధీనముగానున్నది-

సుభ. అక్కటా! యెంత జెప్పిన వినవుగదా నే నేమిసేతును?—

రుక్మి. అక్కా! ఆమాటయేదో వినరాదా యొక్కసారి—

సత్య. (కనుగీటుచు) నీకేమి వెఱ్ఱియా? వినెడువార లుండవలయును గాని మాటలకు కొదువ సేయు నను కొంటివా మనసుభద్ర? వగ లన్న మనవదినెగారి సొమ్మే. (చెవిలోనేమి యో చెప్పును)—

సుభ. అర్జునా, నాకీ పాటు నెటు తప్పింతువో గదా! ఓరిమన్మథా తాళుము నీ నారాచములబీరము నా యర్జునునిపై జూపరాదా? అబలను, నన్ను నేచెదవేమి? అక్కటా! యీ నెమళు లెంతత్రుళ్లిపడుచున్నవి! రుక్మిణీ! యీపాడు నెమళ్లనుదోలివేయవే నిన్ను వేడుకొనియెద—

రుక్మి. ఏమీ! యీసుందరకలాపంబులగు ప్రోదినెమళులును నీకిష్టములుకావా?

సుభ. అదిగో కేకలవేయుచున్నవి. నీకు పుణ్యముండును. వెడలఁగొట్టవే-నాకేమియో యసహ్యకరము లగుచున్నవి.

రుక్మి. ఊఁ! పొండు పొండు మా యజమానురాలికి మీపై గోపంబు జనియించెను—

సత్య. చూచితివా రుక్మిణీ!

రుక్మి. సుభద్రా! చూచితివా చంద్రుడెంత హాయిగను న్నాడో!

సుభ. ఛీ! ఛీ! యీ విషధరుండు నాకు సుఖముఁ గలుగజే యక నేఁడేమో బాధకరంబుగనున్నాడు.

సత్య. ఓహో! మించినది. రుక్మిణీ! నిజముగ మనముద్దుల మరదలకు పిశాచమేపట్టియుండును. లేకున్న నీయసందర్భ ములేమి? చంద్రుడట—బాధకరమట—

రుక్మి. ఔను కానోపు. ఐన మన మేమిచేయవలయును?

సత్య. ఏమిసేయవలయునా? నీవుపోయి మన యుద్యానవన మందలి సన్యాసిని దెచ్చినంగాని యీ పిశాచము మనసుభ ద్రను విడువదు. త్వరితముగఁబొమ్ము.

రుక్మి. అట్లనేబోయెదను. అక్కా! సుభద్ర మే నే మో పు లకాంచితమగుచున్నది.

సుభ. (స్వగతము) అక్కటా! వనమందలి సన్యాసి దెమ్మను నంత పులకలు వొడమినవి. దీనింబట్టి సత్య పోల్చుకొనునే మోగదా.

సత్య. సుభద్రా!—సుభద్రా! ఎవ్వనినైనం దలఁచుకొంటి వా యేమి? పులకలేల గాననగుచున్నవి?

సుభ. కారణము దెలిసిన నే జెప్పనకే. నన్నూరక మీ రా రడిసేయనేల? నా మనంబేమియో సరిగాలేదు.

రుక్మి. అటుకాదు సుభద్రా! సిగ్గున మానుచున్నావేమో? మాతో నీకు సిగ్గేల చెప్పుము. మీయన్న లునిన్నే మయి

న ననిరా?

సుభ. అతి గారాబమున జూచు మాయన్నలు ఏల నన్నేమి యు నందురు!

రుక్మి. వివాహ విషయంబున మా బావగారేమైన ననిరా?

సుభ. అందువిషయమై నాతో మా పెద్దన్నయ్య యేమి యు ననలేదు.

సత్య. తోటనున్న సన్యాసి యేమైన ననెనా?

సుభ. సరిసరి నన్ననుటకు సన్యాసికేమిపని. ఆయనెవరు? నేనెవరు?

సత్య చెలీ! యేల నట్లనుచున్నావు? నీ శుశ్రూషకు ఫలప్రదుండగు ఋషికాడా ఆయన? నీ చేయుసేవయందలి యే లోపంబులకైన నాతఁడలిగెనేమో యనియంటిని.

సుభ. (స్వగతము) ఫలప్రదుండట. సత్యకు నా చేసిన కార్యంబెరుకవడెనా యేమి? కాదుకాదు-ప్రసంగవశంబున నీ మాటలాడవమా?

రుక్మి. అక్కా, సత్యా! అంతియేయయియుండును. కావున నే సుభద్ర బదులీయక యూరకున్నది. రమ్ము, మనమిరువురము గూడి సన్యాసియొద్దకేగి క్షమింపవేడుకొందము.

సుభ. వదినెలారా! ఏలమీరు లేనిపోని వింతార్థంబులఁ గల్పించి నన్నుఁ గారియ పెట్టెదరు? నేనూరకున్నంతమాత్రమున నీయూహాలు ధర్మముతే—ఆసన్యాసికి నేనే యపరాధముం జేయను.

సత్య. మరియేమి? నీప్రాణపదమైన యన్నలును సన్యాసియు

నేమనకున్న నీ విచారమునకు కారణంబేమియగును? మే మింత సేయ నేరముగదా!

సుభ. సత్యా! నీమాటలు వేరుగనున్నవి.

సత్య. కాదుకాదు. నీవు వేరురీతినుంటచే నామాటలు వేరుగ నున్నట్లు కాన్పించుచున్నవి. నే పూర్వపుసత్యభామనా? రుక్మిణీ! నామాటలు వేరుగానున్నవటే.

సుభ. వేరుకాకున్న ప్రాణపదమైన సన్యాసి యని యేలనందువు?

సత్య. హరిహరీ! ప్రాణపదమైన యన్నలు—సన్యాసియు, నని యంటి గాని వేరుగాదుగదా రుక్మిణీ!

రుక్మి. అవునమ్మా! సుభద్రా! నీవుతప్పవింటివేమో గాని సత్య ఆట్లనలేదు.

సత్య. ఆ ప్రాణపదమను నభిధేయము సన్యాసికిగూడ నివ్వవలెనా? నీకు లోకంబున గానుపించు నదంతయు సన్యాసికేయిమ్ము.

రుక్మి. అతనిపై నీ కెంత ప్రేమమే సుభద్రా!

సుభ. అతనిపై నాకెందుకు ప్రేమయుండ వలెను?

సత్య. ఏలనా? అతని సేవజేసిన నీకు వరుఁడు లభించునని గదా యంటివి?

సుభ. చాలుచాలు. సత్యా! నీవేల వచ్చితివి? మా పెద్దవదినెగారు వచ్చిన బాగుగనుండును.

రుక్మి. నన్ను, మా పెద్దక్కయ్యను, చెవులు పట్టి గూడింపజాలుదువుగాని సత్య దగ్గర నీయాటలు పనికిరావనియా?

సుభ. అటుగాదు రుక్మిణీ! మనల కందరకు పెద్దగదా రేవతి?-
రుక్మి. అదిగో-అదిగో - మా పెద్దక్కగారే వచ్చుచున్నారు. ఇంక నీపుణ్యము ఫలించినది లెమ్ము-

[ ప్రవేశము రేవతి ]

సుభ. యేమా! మా పెద్దవదినే? వదినే! నన్ను రక్షింపుము (కౌగలించుకొనును)
సత్య. అక్కా! ఇవియన్నియు వగలునుమా! నిజమనికొని యెదవు (చేసన్న చేయును)
రేవ. ఏమమ్మా! సుభద్రా! నీ కేమి కావలెనో చెప్పుము. రక్షింప నీకుంగల విచారమేమి?
సుభ. వదినే! రేవతీ! నేడేమో నా మది సరిగలేదన్న నీసత్య చూడు మెట్లు నన్నెగతాళిసేయుచున్నదో?
రేవ. సోదరీ! సత్యా! నీకేలనాపని? ఇదినీకుతగునా? మన యందరిలోను సుభద్రయేగదా ముద్దులమరందలు-
రుక్మి. పోనిమ్ము-నన్నుగూర్చి చెప్పలేదు ధన్యురాలనయితిని?
సత్య. మరదలుగాననే మాటలాడితిని-దాని నెగతాళిగా నెంచెనో నే నేమిసేతును-
రేవ. అమ్మా! ఇందులకా నీవిచారము?-
రుక్మి. ఇందులకా? అక్కా, యిప్పుడు చెప్పలేదా మనసు సరిగా లేదని?

రేవ. అమ్మా! సుభద్రా! అందులకు కారణ మేమియో చె
ప్పరాదా?-
సుభ. దానిని నే నే మెరుగను.
సత్య. అక్కా నేజెప్పనా?
సుభ. అమ్మా! రేవతీ! సత్యమాటలు విందువా?
రేవ. విననమ్మా వినను-యేదియో చెప్పనిమ్ము చూతము-
చెప్పినంతమాత్రముననే విందునా? వినిన వేగిరపడుదునా?
సత్య. ఏమియు లే దక్కా! చింపిరిజెడలును, బలుపుమీస
ములను, బవిరగడ్డమును బూడిదెబూసిన మేనుంగల యా
సన్యాసినిఁజూడ భీభత్సవిధముఁ దోచెఁగాబోలు-
రుక్మి. ఆఁ! అట్లగునా యేమి! జడిసెనేమో-అక్కా యిం
క మన మేమి సేయవలయును?
సత్య. ఓసీ! వెఱ్ఱిదానా! విషమునకు విషమే విరుగుడుగా
న తిరిగీ సన్యాసికి మన సుభద్ర నప్పగించిన తానే మెడ
నేదియైన గట్టిపొందుపరచును-
రేవ. (స్వగతము) ఏమిగట్టును తాళిగాక-
సుభ. రేవతీ! చూచితివా? సత్య మాటలు-
రేవ. సత్యా! నీవూరుకొనరాదా-
సత్య. అక్కా! నేనేమంటిని?
సుభ. ఏమంటివా? మాటిమాటికి సన్యాసిగూర్చియే మా
టలాడెదవు-
రుక్మి. సుభద్రా! సన్యాసింగూర్చి మాట్లాడిన నీకేమి?
సత్య. తనకేమియా? సన్యాసిపై నీగ్రవాలిన, తనపై దుడ్డు

బడును-అది యేమి ప్రేమయోగాని యెచ్చటనుజూచి యెరుగముగదా-

రుక్మి. అక్కా! యీసుభద్రకు ఇంత స్వల్పకాలములోనే యెంత యనురాగముగల్గినది!

సత్య. ఇంక నేమిచూచితివి? మరిరెండు రోజులు పోయిన సన్యాసినే పెండ్లియాడునేమో!

సుభ. అమ్మా! రేవతీ! చూచితివా సత్య?

రేవ. సత్యా! ఇంకనయిన నీవు మిన్నకుండరాదా-

సత్య. మిన్నకుండక నా నోరు క్రొవ్వినదా యేమి? సుభద్రకు సన్యాసిపై నింత యనురాగమున్నదిగదా యని యంటిని-అచింపిరిసన్యాసి సుభద్ర కెంత యందముగ గన్పించెనో యని వింతయగుచున్నది.

సుభ. చూచితివా వదినే? ఇంక నెన్నిమాట లాడుచున్నదో! నీవుండియే న న్నిట్టులాడచూచుచున్న దానవా?

సత్య. అబ్బ—యేమియు నెరుగదు—

రుక్మి. అక్కా! నీవూరకుండుము-

సత్య. సరియే నాకేమి కావలయును? నే నిచటనుండను-(స్వగతము) నేను పోయి యర్జును నింక నలంకరింపవలయును. పురోహితుని విశారదుని బిలువవలయును-పెండ్లికార్యంబు సిద్ధము జేయవలయును-(ప్రకాశము)రుక్మిణీ! మనకేమి యిచ్చట-రమ్ము-పోదము-సుభద్రయు సుభద్ర పెద్దవదినెయు మంచివారలు. మనము కాము. వారే యుండనిమ్ము-రమ్ము, పోదము (అనిలాగును)-

రుక్మి. అట్లనే రమ్ము. పోదము. (యిద్దరుపోదురు)-

రేవ. అమ్మా! సుభద్రా! సత్య పోయినది. లెమ్ము శిరము నెత్తుము-

సుభ. అన్నా—అక్కటా! వదినా! ఎంతయెగతాళి జేసిరి?

రేవ. అమ్మా! సుభద్రా! నీవిచారంబునకు గారణంబు దెల్పుము-నాతోజెప్పవా? నేను పగదాననా?

సుభ. వదినే-(అని పాదములబడును)-

రేవ. అమ్మా! తగదు తగదు నీకీవిచారము-(లేవనెత్తి) నీ కేమికావలయునో చెప్పిన నిప్పుడే చేయింతును-

సుభ. వదినే! నాకు నీవే తల్లివిసుమా! నిజము చెప్పెదను-(సంశయించును)-

రేవ. అమ్మా! నీకీసంశయమేల? దాపకజెప్పుము - నీవిచారమేమి?

సుభ. కారణమా? మనయుద్యానవనమందలి సన్యాసియే-

రేవ. సన్యాసినీకేమిచేసెను?

సుభ. అయనయతికాడు-నాచిత్తము దొంగిలించిన మాయకాడర్జునుండు - వదినే, పోయెనుగాబోలు వనంబునుండి-

సీ. మీలోన నొకరేని ♦ మేటియౌ నాతండు
విడిసియుండినచోటు ♦ వెదుకరమ్మ,
వెదకి యాసుందరు ♦ నెదకలుగఁగ నేను
జెప్పినమాటలుఁ ♦ జెప్పరమ్మ,

మాయకాకను రూపు • మాటికిఁ గడుఁ దస్సి
యాడలేను చెలియాఁచు • మఱువరమ్మ,
చెప్పి యాతని నింకఁ • జెచ్చెరఁ దోడ్తెచ్చి
ప్రాణరక్షణపుణ్య • మందరమ్మ,

గీ. కానిచో, నేను బ్రతుకుట • గలుగదమ్మ,
పూవుటమ్ములఁ బ్రాణము • లావునమ్మ,
కంప మొదవెను నన్నర • క్షింపరమ్మ,
మనసులోన సుభద్రను • మఱువరమ్మ.

రేవ. సుభద్రా! మేమెంత నిట్టిమాటలేలనుడువెదవమ్మా—

గీ. అమ్మ, యిట్టివంత • నడలుట తగదమ్మ,
నల్వ గిద్ది విన్న • నగుదురమ్మ,
వానికొఱకె యింత • వగచుట తగదమ్మ,
మనసు నూరడింప • మంచిదమ్మ.

ఇట్టుల తగదమ్మా! గాని యాతఁ డర్జునుండను సంగతి మే మెఱుంగమా? మీయిరువురియన్యోన్యానురాగంబులకై వేచియుంటిమి—

సుభ. అట్లయిన నన్నా త్రిలోకసుందరునితోఁ గూర్తురా?

రేవ. మిమ్ములం గూర్పనే గదా యిన్ని శ్రమ లందుచున్నారము—

సుభ. అన్న బలరాముఁడే మనునో గదా—

రేవ. మీయన్నగారి మాటలకేమి? ఆయ నెన్నఁడైన సరియాయెనా?

సుభ. అమ్మో! ఇట్టిసమయంబున కృష్ణుం డున్న నెంతశ్రేయ ముగనఁగును!

రేవ. తాఁజేయఁదలఁచిన దంతయు మాతోఁజెప్పి మీపెద్దన్న యున్న విఘ్నంబు గావింతురేమోయని యింద్రధరోత్సవంబునకు తీసుకొనిపోయెను.

సుభ. (స్వగతము) హృదయమా! ధన్యతనందితివి- (ప్రకాశము) యిందులకేనా యింద్రధరోత్సవంబునకుఁగొంపోయెను?-

రేవ. తీసుకొనిపోకున్న ప్రతీకారంబు సేయుఁడా?

సుభ. అక్కా! నావిభుఁడన్న నీకాంతున కేలనో యింతకోపము?-

రేవ. సుభద్రా! అదికోపమో లేక తనశిష్యుండు దుర్యోధనునిపై ప్రేమాతిశయమో తెలియదు-అమ్మా-రమ్ము-నీవలంకరించుకొనుమా-

సుభ. ఇప్పుఁడలంకారము లేలను? ఇది నడిరేయిగదా-

రేవ. నడిరేయియైననేమి? ముహూర్తముమంచిదయిన నిప్పుడే వివాహము జరుపవలయును. రమ్ము-

సుభ. హృదయమా! ఇప్పుడు నీనోములు ఫలించె-నీవ్రతంబులు సఫలంబులయ్యె-

రేవ. రమ్ము ... (అని దారిచూపును)-

సుభ. పోవలయునా? (పోవును).

రేవ. ఈపాటికా సత్య, యర్జునుని యలంకరించియేయుండును-(అని యటునటుజూచి) ఇదిగో సత్య యర్జునుండిసిటో

ని తానే వచ్చుచున్నది- ఆహా! ఏమి యీసుందరాకారము! అందుననే సుభద్ర వీనినింతగా వలచెను-

[ ప్రవేశము-సత్యయు నర్జునుఁడు ]

తమ్ముఁడా! క్షేమముగా నున్నాఁడవా?

అర్జు. (నవ్వుచూరకుండును)-

సత్య. మనతమ్ముఁడింకను మౌనమునే దాల్చియున్నవాఁడు- మౌనిగదా-

రేవ. ఔను మరచితిని-సన్యాసిగారుగదా-

సత్య. దొంగకోలుసన్యాసులకు సుభద్రయన్న ప్రాణమే యగును-

అర్జు. అక్కా! సుభద్రయేది?-

సత్య. తమ్ముఁడా! క్షణముండ లేనివాఁడవు మునివృత్తి నేల బూనితివి? తాళుము-వచ్చును-

అర్జు. పాప మింకను విచారించుచున్నదేమో వలదని చెప్పుము.

సత్య. అంతప్రేమ మాపైయున్న నెంతబాగుండునో-

రేవ. సత్యా మనపై లేదేమి?

సత్య. ఉండెననుండుగాని బహుకాలముండదుగదా-

అర్జు. అక్కా! అదియేమి? అట్లను చున్నదానవు?

రేవ. భార్యలువచ్చిన వెనుక నక్కచెల్లెండ్ర మరతురని-

సత్య. అందును మనసుభద్రవంటి జాణ భార్యయైన నింక

నే జెప్పునదేమి?–

రేవ. సత్యా! నీవాసుభద్రనూర్చి పలుకకుము–పసిబిడ్డఁశోఁడ నీకేమిపని?–

సత్య. అయ్యో! పసిబిడ్డ–నోట ్రవేలిడినను కరువనేరదు–కొండంతనాతమ్ముని సన్యాసిగా జేసినది, పసిబిడ్డా? ఏది! అమ్మాయీ! సుభద్రా! ఇటురమ్మ–

సుభ. (లోపలనుండియే) నీవునువచ్చితివా? తాళుము–తొందరేల?–

సత్య. నీవునువచ్చితివా యట–నేనురాక యొక్కయర్జునుఁడేవచ్చిన తొందరయంచునుగాబోలు–

[ ప్రవేశము – విశారదుఁడు – రుక్మిణియు ]

అర్జు. మిత్రమా! విశారదా! చూచితివా? యెట్లుమారియున్నానో–

విశా. వేరేచెప్పవలయునా? నీవు వేషమున కొక్కవెలదిని సంపాదించుచున్నాఁడవు – యెన్నిమార్పులనైనను పొందుదువు–

అర్జు. (నవ్వుచుండును)–

విశా. పెండ్లికుమార్తెయేది?

రుక్మి. సుభద్రా! అచ్చట నీవు చేయుచున్న రాచకార్యమేమి? రాకూడదా? నీకొఱకు ఋషులు వచ్చియున్నారు.

రేవ. రుక్మిణీ! నీ వేల సంతతొందరబెట్టెదవు? సుభద్రయ

లంకరించుకొనుచున్నది-

సత్య. అలంకారములో కటిరియా? మాటలతోనే మాతెమ్ము ని వలలో బడవైచుకొనిన నీ వలంకారములతో సింకేమి సేయనున్నావో?-

విశా. అర్జునా! నీవే ధీరుఁడవు—

అర్జు. ఏల విశారదా, అట్లనుచున్నాఁడవు?

విశా. ఎండవానల కోడక, తిరికని పెట్టి, సమయమునదాఁకొనినప్పుఁడు నీనిజంబుఁ దెల్పి, నూతనవరుండ వగుచున్నాఁడవు ధీరుఁడవుగావా?

అర్జు. మిత్రమా! హేళిసేయు నిదియా యనను?—

రుక్మి. నేను పోయి సుభద్రకుసాయము సేసెదనుగాక (అని పోవును)—

విశా. ఇది మేలనదనుగాదు? ఈఘడియ దాటిన నింక నే వేషమున నుందువో? అప్పుడు నీతో మాటాడ నగునో కానేరదో?—కాన నిదియే సమయము.

సత్య. అక్కా! రేవతీ! యీవిశారదుండు పెద్దబ్రహ్మచారింబలె కానవచ్చుచున్నాఁడు. అయ్యా విశారదా! కానున్న భార్య యెట్టయెదుట నుండ నీ విట్టిమాటలవరా దని తమ్మునిమూహా.

విశా. ఏమేమి? భార్యయుండరనసరాదా?

రేవ. అనరాదు. పురుషులకు మానినులయెదుట నెక్కడలేని పౌరుషంబును వచ్చును.

విశా. వచ్చునుగదా. అట్లయిన భార్యయుండే యనవలయు

ను. నీకన్నైన పౌరుషంబు దెచ్చుకొని మరి నన్నింకొక పెం డ్లికి రమ్మనకుండ యుండుము.

సత్య. ఇంతకుముందు నీ పెన్నిచోట్లు నిట్లనే ప్రగోపింతుండ నైతివి?

విశా. ఇప్పటికయినవి రెండు. ఇప్పుడు సిద్ధముగనున్న దొక టి. యింక రానున్న పెన్నిపో దేవునకెరుక.

అర్జు. చాలు చాలు విశారదా! కట్టిపెట్టరాదా—నీప్రలాపంబులు.

సత్య. విశారదా! తమ్మునకు నీమాటలవం గోపముగల్గు చున్నది. ఊరకుండుము.

విశా. నే నూరకుండినమాత్రయు గల్గు లాభ మేమి?

రేవ. లాభ మేమియా? మే మది యెఱుంగకుంటిమే లాభము—

విశా. పిచ్చిభ్రమలు. ఆచిత్రాంగద పెండ్లినాఁడు చూస్తినే యు ముననే చిన్నపంటకము పరిమెళ మింకను మఱువక నేనును, ఆనాటి వివాహచిహ్నంబులన్నియు ముఖంబుననే కల్లసేసే యుచు నర్జునుండును సాక్షిభూతము లై యుండ మీ రది యెటుల నెఱుంగరు? నలయునన్న నే నూరకొనియెద.

రేవ. దొంగవాఁడా, కదువకురా యనునట్లు బాగుగ జెప్పెను. చిత్రాంగదను అర్జునుండు పెండ్లియాడెనా?

సత్య. అక్కా! యీసంగతి నింతకుము న్నెఱుంగవా?

రేవ. నాకెట్లు తెలియునే సత్యా!

సత్య. మాబావగారైన నీతోఁ జెప్పలేదా?

రేవ. అర్జునునిమాట మీభావగారెన్నఁడైన నందురా

విశా. అమ్మా! కాలవిళంబమేల? మిత్రుఁడు తత్తరముగనున్న ట్లు గానుపించుచున్నాఁడు.

సత్య. సరిసరి. సుభద్రా యెంతసేపు నీయలంకరించుకొనుట—

అర్జు. అక్కా! ఏల నంత తొందరబెట్టెదవు

సత్య. భార్యనొకమాట యనిన గోపమేనా? అట్లయిన నూరకుందును.

విశా. అర్జునా! ఇంక నేమైనయవతారముల యెత్తియున్నావా?

అర్జు. అవతారంబు లేమియున్నవి? పన్నుటయేమి?

విశా. అవతారంబులుగావా నీవేషములన్నియు

అర్జు. చాలువిశారదా! నీకుపనిలేదా?

విశా. నీవు వివాహములనుంట చూచుచుంటినానని.

రేవ. సత్యా! నిక్కముగ తమ్ముఁడు మంచివానిని వెంటబెట్టుకొని వచ్చెనుసుమా! విశారదుని పల్కులు చింతల నెల్లబారద్రోలునుగదా.

సత్య. అంతులకు గొనివచ్చెననుకొంటివా? అక్కా! యీయన బాటసారివ తోడు; మానినిగనుండ శిష్యుఁడు; పెండ్లియాడ పురోహితుఁడు; సల్లాపంబులకు హితుఁడునై, యుండునుగదా యని వీనిని దెచ్చెను.

విశా. (స్వగతము) అన్నా! యీసత్యభామపల్కులే నిజమయ్యెనేని నాకును అపహాసపాత్రుంబునకును భేదమేమి? అదియు కట్ట ధావళియు, మీదనేయ నుత్తరీయంబును

కప్పుకొన సుప్పతియు, ప్రక్కకు పఱుపును; అగుటయేగా
క చూపరుల కొంచకదాయకముగ నుండును.

రేవ. ఏల నింక సుభద్ర రాక తడయుచున్నది?

రుక్మి. (తెరలో) అక్కా! చూచితివా, యీ సుభద్ర యెం
త జెప్పినను మానక చిల్కలకు పలుకుల నేర్పుచున్నది.

సత్య. అబ్బ! యింతసే పెక్కడ బోయినదో యీశ్రద్ధ? పి
లుచుచున్న నిట్టియాటల నాగఁజేయును.

రేవ. సత్యా! తాళవే. సుభద్ర ముగ్ధ గనుక సిగ్గున రా
లేదు.

సత్య. అక్కా! యిన్నినాళ్లు నుద్యానవనంబున సేవఁ జేసిన
సుభద్రయేనా! లేక యిప్పుడు వేరు సుభద్రా?

రేవ. అవును. ఆ సుభద్రయే, అయిననేమి?

సత్య. ఆమునియేనా? యీతన్మునిచూచుటకిపుడుసిగ్గెచట
నుండి వచ్చెను? అర్జునునిగూర్చి ప్రసంగించునపుడు సిగ్గు
లేదా? తప్పక పెండ్లియాడుదునన్నప్పుడు సిగ్గులేదా? కరం
బున కరంబు జోడించినయపుడు సిగ్గులేదా? యిప్పుడేనా
సిగ్గు. అబ్బా సిగ్గు!

విశా. ఏమియర్జునా! లక్ష్మణుని నవ్వునట్లు ఇన్నినాళ్లను నీ
వు విడిచినసిగ్గంతయు నిప్పు డినుమడించి వచ్చెనాఏమి?
తల నారీతి నాడించుచున్నావు?

సత్య. (లోనికిపోయివచ్చి) విప్రోత్తమా! అర్జునునటు వివా
హవేదికడకు దోడితెండు నేనును సుభద్రందెత్తును.

[నిష్క్రమింతురు.]

# షష్ఠాంకము.



[పృథుశ్రవసునివర్తనము]



[ప్రవేశము—అర్జునుడు, సుభద్ర, విశారదుడు.]

అర్జు. ప్రాణప్రియా! నీవుచూడవలసినవన్నియు నిటజూచితివా? మనము రథము నెక్కిపోదమా?

సుభ. మనోహరా! ఆపీటనున్న చెట్లను జూడలేను. రండు చూచి తే రెక్కిపోదము.

విశా. అన్నా! ఆడవారిని దీసికొనివచ్చిన నిదియేచిక్కు, ప్రయాణమన్న నేమియో యెరుగరు. ప్రయాణమునకుగల చురుకుదనము వారల కబ్బదు. శృంగారించుకొనుటయందు నాలస్యము చేసియో, యిరుగుపొరుగుల వారియొద్ద సెలవుపుచ్చుకొనజాగుసేసియో, చుట్టంబుల విడువలేక వగచుటయందుతడపియో, ఒకటిచూచుచు నిలచియో, ఇంకొకదానినిగూర్చి ప్రసంగించుచు మరచియో, నెట్లనో కాలంబుమీర సేతురు. అక్కటా! వీరలకుయానమునకుగావలయు జాగరూకత యబ్బదగదా నరులు సుఖులగుదురు

అర్జు. విశారదా! యేల నటనుచున్నాడవు? చంద్రాననా! చూచితివా విశారదునిమాటలు—

విశా. యేల నని న న్నడుగుచున్నాడవా? సరిసరి- కామము నకు కన్నులు లేవు- కాముకులు జూడ లే రను వాక్యము ను సార్థకము జేయుచున్నాడవా?

సుభ. విశారదా! యేలనట్లనుచున్నాడవు? నాథుఁ డెట్టు లా వాక్యమును సార్థకముఁ జేసెను-

విశా. సార్థకమా మరియు సార్థకమా? ఒకతట్టునఁజూడ దండ తాడితభుజగంబు భాతిభాసిల్లుచు బలోదగ్రుండై బలుఁడెప్పు డువచ్చునో యను భీతియుండ, నింకొకవైపునజూడగడు పుమించెనుగదా యని ధర్మజాదు లెంత చింతింతురోయ ను భయముండ, వేరొకదిక్కునఁ జూడ నసూర్యంపస్యవ గు నీవు కంటకావృతదేశంబుల నడువలేవేమో యను శంకయుండ, నన్నిటికిని మేటియగు నాజఠరాగ్ని నోదా ర్ప శీఘ్రంబున నింతయాహారము దొరకునో లేదో యను వెరపున నే నుండ నీమాటలేమి - యీవిహార ము లేమి-

అర్జు. విశారదా! క్షుద్బాధ యధికంబుగనున్నదా యేమి?

విశా. 'మహాబధిరశంఖారావముల' నున్నట్లు నీకడ నారో దనమంతయు నిష్ప్రయోజనంబగుచున్నది-అయినను జె ప్పెద-క్షుద్బాధయత్యధికముగనున్నది-

[ తెరలో ]

ఈ అశ్వమునకుగూడ క్షుద్బాధ యత్యధికమగుచున్నది.

విశా. ఆఁ! యెవఁడురా ఆతుచ్ఛుఁడు? ఈయశ్వములకూ క్షు

ద్భాధ-అశ్వములకూ యట. నేనును అశ్వములును ఒకటియా-

అర్జు. అదియేమి విశారదా!-

విశా. అదియేమియా? ఇప్పు డశ్వములతో సరిజేసెను-రేపు గాడిదెలతో సరిచేయును-ఆః! తుచ్ఛుకు వీనిపీచ ణగింతును. చూడుము-ఎవడురాయది

[ తెరలో ]

"సమరవిజయా! యీహయములు మూఢునియింద్రియంబు
బులవలె చపలులయి కాలుద్రువ్వుచున్నవి-
తేరెక్కిపోదము-"

విశా. అదిగో అదిగో-వీనిసూచనలఁజూచితిరా? నాకిప్పుడు వచ్చినకోపము మూఢునియింద్రియంబుల చపలతయంట-చూచితిరా? అశ్వము నేగాక మూఢుఁడనైతిని-ఓరీ! దుర్మదా-

అర్జు. విశారదా! సారథి హయములగూర్చి మాటలాడుచున్నాడు-గాని నిన్నుగాదు- నీవేల తత్తరమందెదవు?-

విశా. ఆః! తత్తరమా? ఇట్టిసమయములలో కానరాని పౌరుషమెందులకు-సారథియైనసరే-గీరథియైనసరే? చూడుము- (పోవును).

సుభ. నాథా! విప్రు డంతదాటిని బోవుచున్నాడే-పాప మా సారథి కేమయిన హానియగునేమోకదా!-

అర్జు. ఓసి! బేల! చేజిక్కిన పామునయినం జంపఁజాలదు-సారధికేమియు హానిలేదు-

సుభ. అట్లయిన మన మాతట్టున జూచుకొని వత్తమురండు-

అర్జు. అలసగమనా-

గీ. సఖియు, యీనడకనె • చాలంగడస్సితి;
వింక నేల నీవు • మృదుపదముల
నలయ జేయఁ జూతు • వత్వ్యాన్న తములగు
నూరు కటి కుచముల • భారమునను.

రమ్ము-రథమ్ము నెక్కిపోదము-సుభద్రా! చూడుము-విశారదుండెట్లు విఫలీకృతమనోరథుఁడై వచ్చుచున్నాడో-

విశా. (ప్రవేశించి) అశ్వములతో నన్ను సమముగ జూచెను గదా యని కోపించి వెళ్లిన నేను ఆకరువనుంకించు గుఱ్ఱములకు తక్కువయై రావలసివచ్చె. ఆసారథియే నిజమువక్కాను. నాయభిప్రాయమే కూడనిది-లోకమున నిట్లులేగదా తమ నిజస్థితికన్న నెక్కుడువారమనుకొని కార్యంబులచేత తమహీనతను వెల్లడిచేసికొందురు-నేనేయొక కవినైన పక్షమున లోకులకెంత యుపయోగమైన నీతినిగరపుదును-ఆఁ! మరచితిని-అప్పుడు నిట్టులే అయ్యవారిని చేయబోయి కోతినిజేతును-

అర్జు. విశారదా! సారథిని కఠినదండనకు పాత్రునిగా జేసితివా యేమి?

విశా. మర్యాద నిలువబెట్టకొనవలయునుగదా- (ప్రకాశ

ము) అర్జునా! నీయుగ్రము లాతని ప్రాణముల నేడుగా చెను-

అర్జు. ఏమిరా! సింహనాదంబులజేయు నిన్ను జూచి బెదరి పారజొచ్చెనా యేమి?-

విశా. ఆ! పారిపోయిన విడుతునా? యేమియోగాని ఆయు గ్రముల జూచినంతనే నామనసు తిరిగిపోయెను-ఇంక ర మ్ము-తేరెక్కిపోదము-

సుభ. నాథా! అట్లయిన రండు పోదము.

[ తెరలో చప్పుడగును ]

సుభ. నాథా! ఆచప్పుడేమి?

విశా. యేమిదైవమా! మేఘములేని యురుముగ్రమోత-

అర్జు. ఉరుముగ్రమోతగాదు-ఈ యూరిపాలకుడు మనల నె దుర్కొవచ్చుచున్నాడు.

విశా. ఇందులో నిదియొకటియా? గాని, శహభా సర్జునా! ని న్ను భోజనశాలకన్న నెక్కుడుగా పొగడవలయును-

అర్జు. విశారదా! యేలనటులనుచున్నాడవు? భోజనశాలకు నాకుగల సందర్భమేమి?

విశా. భోజనశాల పొంతనుండువారి కొకటిరెండు రసము లున్న నీచెంతనుండువారికి పెక్కు రసములుండునుగదా-

అర్జు. అదియెట్లు-

విశా. ఎట్టులా? ఉలూచీ, చిత్రాంగద సుభద్రలం బెండ్లి యాడుటది శృంగారరసము. అందులకు నీవుపడినపాట్లు జూచునప్పుడు హాస్యరసము. ఆపాటులజూచి నేనాశీనమా

టుకెల్ల హాస్యరసము. ఇంక మాటలేయక వచ్చుచున్నవి వీరరౌద్రభయానక రసములు. ఇన్నిరసములకిల్లు, నట్టింటిని మించదా?

సుభ. విశారదుండు మిక్కిలి వినోదకారుఁడు. గాని యీ యూరిపాలకుఁడు మనపై నేల దండు వెడలుచున్నాఁడు?—

అర్జు. ప్రాణప్రియా! యీరాజు నిన్ను నేను దొంగిలించి తీసికొని పోవుచున్నాడనను యూహతో తన రాజభక్తి ప్రకటింప నెమరింపవచ్చుచున్నాఁడు—

సుభ. ఏమేమీ! నాథా! ఈసంగరంబునకు నేనా కారణంబు? అట్లయిన నాకళంకంబు నానుండి బాయనేనే మీకు రథంబుగడెపెద. రండు—రథమెక్కుదము—

అర్జు. (చెక్కిలినొక్కి) సుభద్రా! మెచ్చితిని గాని యిప్పుడంతయవసరమేమున్నది—

గీ. కాంత, నన్నిట నే వాని • గాఁదలంచి
తీవ్ర ప్రాణంగ నంతటి • దేమికలిగె?
చూడు మెట్టుల చెండెదనో • నీడవారి
కంధరము దోలు నా దిన • కరునిమాడ్కి.

సుభ. నాథా! మీరందులకు జాలరనియా?

చ. అరదము దోల శాత్రవకు • లాంతక, సాత్యకి దెల్ప నేర్చె నే
నరుఁడ రథమెక్కెదం గడప • నమ్మితి వచ్చిన కోర్కెగాఁగ నే
యరమర లేక యాముదలి • కన్నెయొసంగవె ప్రాణనాయకా!
వెరవిడి యీయ రాదె మదిఁ • బాయని ముదముగఁ నెంచవే ప్రియా.

అదె వారు వచ్చుచున్నట్లున్నది-రండు తేరెక్కుదము-

విశా. (స్వగతము) ఆహా! నా బ్రతుకు స్త్రీ బ్రతుకుకన్న హీనమాయెగదా-ఛీ-యీ కానున్న సంగరమున రణరంగభీముడన న్యెవ్వద చూతుడు.

అర్జు. నీమది కిచ్చవచ్చిన యట్లు జేయుదము-రమ్ము-పోదము:

(అని పోదురు)-

విశా. ఎట్లయిన నే నా శౌర్యంబుంజూపవలయును-

[ తెరలో ]

గీ. శౌరి యూర లేని ♦ సమయ మందర్జునుఁ
డెంత దవ్వువచ్చె ♦ కాంతఁ గొనుచు
తోడి తెండు మన పృ ♦ థుశ్రవసుని వేగ
యేరి భటులఁ బొండు ♦ దారి గట్టి.

విశా. ఊఁ! కానిండు-రండు - మీ బీరములు నాయెదుట నా? (నిష్క్రమించును.)

[ ప్రవేశము-పృథుశ్రవసుడు కొందరుభటులు ]

పృథు. ఆఁ! ఆఁ! ఏమి యీ తెంపరితనము ఏమిది యర్జునా!

గీ. ప్రభువు లూర లేరు ♦ పార్థివా! కాంతను
గొంచు బోవ నుంత ♦ కొంక వేమి?
మత్స్య యంత్ర మేయు ♦ మహనీయ కీర్తిని
పొందు గాఁగ నింక ♦ న్వలు చేసి.

నిలు నిలు మర్జునా! సేనానాయకా చూడుము-చూడుము-

మొదటిభటుడు. మహాప్రభో! అదిగో ఆ యర్జునుండు పారిపోవుచున్నాడు-

పృథు. ఏమేమి? అర్జునుండు పారిపోవుచున్నాడా? సేనానాయకా!

గీ. హయముల వదల్చి యర్జునుఁ ♦ డతి పరుగునఁ
బోవుచున్నాఁడు మోరలు ♦ మొత్తములయి
పోవ నీయక కట్టుఁడు ♦ త్రోవ లెల్లఁ
దెలుపుఁ డొక వేగి వేవేగ ♦ బలుని తోడ.

ఇదిగో నేనును వచ్చుచున్నాను-విడువవలదు-విడువవలదు (పోవును)-

రెండవభటుడు. ఓరీ! పారిపోవుటగాదురా-ఆదిక్కునను న్నమనవీరుల చెండుటకు బోవుచున్నాడు-

అర్జు. (తెరలో) మేలు సుభద్రా! మేలు-చూచితివా!

గీ. ఇట్టి వారెందఱైనను ♦ నీక్షణంబ
పట్టిపరిమార్తు చూడుము ♦ భయము లేక
ఓరి మోహాంధులార, మీ ♦ వారి నెల్ల
తెచ్చి వేవేగ నంపుదు ♦ త్రిదశ భువికి.

మొ॥ భ. ఓరీ నీవన్నదియేనిజమురా! అదిగో అర్జునుండు చూడు మొత్తుచెండుచున్నాడో-

రెం॥ భ. (చూచి) అబ్బా! యేమిరా యీయర్జునునిలావు-

రెండు చేతులతో నపరిమితంబుగ గొట్టుచున్నవాడురా.
అబ్బబ్బ! యెవనితరమురా యీతని నెదిరింప వచ్చుట.

అర్జు. (తెరలో) ఆదిక్కున దోలుము సుభద్రా!—అటు అటు—

మొ॥ భ. ఓరీ! చూచితివటరా! ఆకాంత యెంతబాగుగ రథంబు గడపుచున్నదో? అతిరథమహారథుల సారథులకైన నుండదుగదా ఆనేర్పు!

రెం॥ భ. ఏమహారథికుఁడైన నాయర్జునునిముందు పనికివచ్చునా యేమి? ఆహా! ఏమిశక్తి! ఏమిబాణములు! ఓహో! యేమిమరణము! గుండియులవియుచున్నవిరా!

విశా. (తెరలో) మూఢుడా! చావు చావు పెండెకట్టెంజూచినంతతోడ నాపయికురుకుటా? నల్లగనున్నంత మాత్రంబున గొంగళియనుకొంటివా? నాదండంబు నా చేతనుండ నన్నెదిరించి ప్రాణంబులతో బోవు వాఁడెవండు రండు-రండు (అనికర్రక్రిందఁగొట్టును.)

మొ॥ భ. ఓరీ! ఏమిరా? ఆచప్పుడు?

రెం॥ భ. ఏమియులేదు. ఎవ్వడో వెఱ్ఱిబ్రాహ్మణుఁడు కఱ్ఱక్రిందఁ గొట్టుచున్నాడు.

విశా. (ప్రవేశించి) తుచ్ఛా! తులువా! ఎవడురా వెఱ్ఱిబ్రాహ్మణుఁడు. కఱ్ఱక్రిందనుగొట్టుచున్నాఁడేం? విశారదుని పరాక్రమంబెరుంగవా యేమి? ఈదెబ్బతో తెలియునులే! (అని కొట్టుచున్నాడు.)

[ వారుపారిపోదురు. ]

ఓరినీచులారా! పారిపోయెదరేమిరా? (అని లోనికిపోవును.)

పృథు. (తిరిగివచ్చి) ఓహో! ఏమియీనినదము (చూచి) హా! అర్జునా!

గీ. వింట బాణ ముంచి ♦ వీను లంటఁ దీసి
బాణ మేయ వేయు ♦ భటులు గూలు
చున్నవారు, వారి ♦ హా యను నాదమెల్ల
గాక వేఱేమి ♦ గాఁగ నోపు!

(అనిముందుకువచ్చి) ఆఁ! ఆఁ! అర్జునా! తాళుము. తాళుము. పిఱికివారిపై జూపకుము వచ్చుచున్నాను. తాళుము. ఆఁ! ఇంకనట్టులే కొట్టుచున్నాడుగదా.

గీ. ఓరి దొంగ, మూఢ, ♦ యోరి పాపాత్మక,
భటుల నేసెదేమి? ♦ బంటు రీతి
నేను వచ్చి యుంటి, ♦ నీ వీరమంతయుఁ
జూపి నన్ను గెలుము ♦ శూరుని గతి.

ఇదిగోరమ్ము.

అర్జు. (తెఱలో) గీ. ఓరి నీచుఁడ! చెనటి! పో ♦ రోరి నీవు
నన్ను గెల్తువటన్నను ♦ నమ్మ కెట్లు?
రమ్ము, నీ భట మిత్ర సం ♦ ఘమ్ము తోడ
రమ్మురమ్మేల ప్రేలెదు ♦ రణము నందు?

పృథు. అదిగో! వీరములు పండఁగుచున్నవి! (పోవును.)

మో॥ భ. శాబాసర్జునా! మేలుమేలు సుభద్రా! ఇంక పృథుశ్రవణుఁడింత యడఁగును. (చూచి) అదిగో పారిపోవుచున్నవాఁడు—

అర్జు. (తెరలో)

చ. నిలు నిలు మేను దొంగనని, ♦ నీవు మహాబలశాలి వంచు, నిం
దొలఁగఁగ జేయ యుద్ధమున ♦ దుస్తర మంచును, బల్కి యిప్పు డా
పలుకులు వ్యర్థ మౌనటుల ♦ పాఱఁగ జూచిన నిన్ను వంటి యీ
యిల గల ధారుణీ ధవుల ♦ కెక్కడి బీరము, సత్య, మారయన్?

సుభద్రా! ఆతూర్పు దెసం దోలుము. ఓరీపందలారా! నిలుము—పృథుశ్రవణా!

గీ. ఓరి పాఱు బోత ♦ బీరము లెన్నియో
పల్కినాఁడ వేల ♦ పఱుగు విడుటు
నిల్వు నిల్వు మోరి ♦ నీచుఁడా! తుచ్ఛుఁడా!
పల్కు లొక్క మొగిని ♦ పల్కఁ గలవె?

తోలుము సుభద్రా! తోలుము.

మో॥ భ. అక్కటా! రాజునకపాయ మగునేమో! (పోవును)

[ప్రవేశము—బలుఁడు.]

గీ. ఏడి యాక్రూరుఁడు? తులువ ♦ యేడి? ద్రోహి
యేడి? యాదుష్టుఁడు, చెనటి, ♦ యేడి దొంగ?
యెందుఁ బోయెనో? వాఁడిపు ♦ డెచట నుండు?
తెండు, తీర్చెద వానిదౌ ♦ కండ క్రొవ్వు.

గీ. నేను లేని వేళ ♦ నీలాలకం బట్టి
ధొంగిలించి పట్టి ♦ ద్రోహి,! యోరి,
యెందు దాగినా వి ♦ దేల గన్పడరావు?
యోరి పాపి, మూర్ఖ, ♦ యోరి మూఢ.

ఎవరురా భటులు? పట్టుడు. వానిని ద్రుంపుడు. ఇదిగో నే నును వచ్చుచున్నాను. ఓరీ! అర్జునా! పాపీ! కపటత్రిదండీ! బలరాముని యెవనిగా నెంచితివిరా? (అనిపోవును)

కృష్ణ. చ. వలదు సుమా మదగ్ర జయ ♦ వారిత కోపము తోడ నర్జునుం
దలపడఁ బోవ నాతఁడతి ♦ దారుణ కార్ముక ధారుఁ డంచు, లో
కులు కొనియాడు చుందు రది ♦ కొంతయిన న్దనబల్మి నూపడే
యిల నతఁడేమి చేసె నిటు ♦ లీవు భరింపని కోపమూనగన్.

బలు. ఏమీ వంచన జేసి చెలియం దెచ్చిన జాలదా!

మ. అవురా! యీతని సాహసంబు భళిరా! ♦ యజ్ఞానపుం జిత్తమా
పవ నాహార కులాగ్ర గణ్యు నిదుడా ♦ పల్బట్ట నుంకించుటో
రవిజా స్సంగర కారణంబున గరా ♦ రమ్మంచు కాల్ద్రువ్వుటో
కవియన్ మన్నికళాంబ కానని మహా ♦ కాఠిన్య శస్త్రాస్త్రముల్.

కృష్ణ. అన్నా బలరామా! ఆ యర్జునుఁడేమి సామాన్యుఁడను కొంటివా?

గీ. ధీరుఁడా ద్రోణు శిష్యుఁడు ♦ వీరుఁ డఖిల
విద్యలందును నేర్పరి ♦ వీనిఁ బట్టి

యల్పునిగ నెంచి మొనసీన ♦ నాధు లెన్ని
మూడునో దాని దెలియఁగఁ ♦ జూడ వేమి.

బలు. ( వినిపించుకొనకయే )

చ. ఎఱుఁగఁడొకో, వి పక్ష పృథి ♦ వీశ్వర జీవ హాలాహలంబు గా
నెఱుఁగఁడొకో, విరోధి బల ♦ వృష్టి ఖరాంగు నపార దీప్తి గా
నెఱుఁగడొకో, మదీయ నిశి ♦ తేషు భయంకర లీలల స్సరే
యాఱ నిముసంబు లోన న్నడు ♦ గంటగ జేయుదు సంగరాంబుధిన్.

ఓరీ! పాపీ! వీఁడానన్ను బడల్పరచువాడు

కృష్ణు. అన్నయ్యా! వింటివా?

గీ. పురము లేర్చు ధీరుఁ ♦ డె రణరంగమునను
వచ్చి తాకి మిగుల ♦ వసట జెందె,
శివుని గెల్చు వాని ♦ సీరాన గెల్వఁగఁ
జాల గలవె నీవు ♦ సంగరమున.

గీ. మత్స్యయంత్ర మేయ ♦ మన వార లందఱు
జేయు యొద్దమున న ♦ జేయుఁ డయ్యె,
అట్టి మేరు ధీరు ♦ నల్పు గా నెంచితే
తగదు వానిఁ జెనక ♦ తగదు మనకు.

బలు. ఓరీ! నీచాధమా! యెంత మోసము జేసితివిరా-నిక్క
ముగ యతివనుకొంటిరా మూఢా-కృష్ణా! విడువుము-వా
నిం బరిమార్తును-

కృష్ణ. అందులకు నిన్ను నీవే దూరుకొనవలయును-

బలు. యేలను?-

కృష్ణు. వద్దువద్దని యెంతజెప్పినను సుభద్రం బంపితి వం
దులకు-

బలు. మంచి వరుఁడు లభించునని పంపితిని-

కృష్ణు. అందుననే మంచివరుఁడు లభించెను-

బలు. ఈతుటుకయా మంచివరుఁడు?

కృష్ణు. ఇట్టి వీరుఁడు మనసుభద్ర కెన్నఁడైన లభించియుండు
ను-ఆయర్జునకేమికొరంత-

ఉ. మారుని గేరు రూపునను, శూ ♦ మారుని మీరు పరాక్రమంబు, నా
మారుని మామఁ బోల్యశము, ♦ మారుని వైరి సఖుండు, నా శచీ
మారుని సూనుఁ, డంచిత సు ♦ మారుని శిష్యుఁడు, ధీరుఁడన్న ము
మ్మారు నితండె యీతనికి। ♦ మారుని కేధర జాతుమగ్రజా.

చూడుము వారు రథమున నెట్లున్నారో-

బల. అయ్యో! సుభద్రా! సోదరీరత్నమా!

గీ. ఏటి యగు నొక్కనికి నిచ్చి ♦ యెంతొ నీవు
సుఖము గన్గొని నేను ను ♦ సుఖము నంద
దలఁచి యుంటిని గాని యీ ♦ దైవ మిటుల
దుఃఖ వారిధి ముంచుట ♦ దోషదయ్యొ.

అక్కటా—

కృష్ణు. ఆవిచారమంతయు నీకుగాని మనసుభద్రకుగాదు-

బల. ఏమీ! ఆసుభద్ర కర్జునునిపై ప్రేమయనెదవా?-

కృష్ణు. ప్రేమ లేకున్న తానర్జునురథ మేలగడపును? తానెన్ని

నాళ్లనుండియో కోరియుండెను-

బల. అట్లయిన నాకేటికి పోరాడ-సుభద్రసంతసంబే నేగో రినది- ఓరీ! ఆసుభద్రార్జునుల నిటు రమ్మనుము-

కృష్ణ. అన్నయ్యా! ధర్మజాదులం దోడ్కొని రమ్మన్న నెంత బాగుగనుండును-

బలు. ఓరీ! నీవతిశీఘ్రముంబునబోయి ధర్మజాదుల దోడ్కొనిరమ్ము-

కృష్ణ. అన్నయ్యా! రమ్మర్జునునియొద్దకుపోదము-

బల. అదిగో వారును తేరినుండిదిగుచున్నారు-

బావా నమస్కారము-కృష్ణా! వందనములు-
అన్నా నమస్కారము-చిన్నన్నా వందనములు-

అర్జు.
సుభ. (ప్రవేసించి యందరం బరామర్శింతురు.)

కృష్ణ.
బల. కల్యాణమస్తు.

కృష్ణ. అమ్మా!సుభద్రా! నీకోర్కె ఫలించెనా? యింక నేమికావలయునో గోరుము-

సుభ. అన్నయ్యా! నీదయనన్నియుం గలవు-అయినను-

గీ. ధరణి ప్రజలెల్ల సుఖమునఁ ♦ బరఁగవలయు,
దుష్ట జను లిప్పు నాశులు ♦ తొలఁగ వలయు,
అన్ని జాతులవారును జ్ఞాన ♦ మబ్బ వలయు,
పలు విధంబుల దేవునిఁ ♦ గొలువ వలయు.

[నిష్క్రమింతురు.]



# Advertisements.